Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 14 • 6-4-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# తెలంగాణ చిక్కుముడి విప్పుతారా?

తెలంగాణ సమస్య మొండి శిఖండి మాదిరి తయారయ్యింది. తల తెగనరికామను కొంటే, తోక నుంచి ప్రాణం పుట్టుకొని వస్తున్నది. దానికి చావన్నది లేకుండా పోయింది. గత ఆరేడు నెలలుగా కెసిఆర్ తెరమరుగు అయినట్లు కన్పించడం, ఉద్యమ వేడి ఉపశమించడం, మోత్కుపల్లి నరసింహులు వంటి తెలుగుదేశం నేతలు కెసిఆర్‌ను నీచంగా తిట్టినా బదులు చెప్పే స్థితిలో టిఆర్ఎస్ లేకపోవడం వంటి కారణాల వల్ల తెలంగాణ అలజడి బాగా తగ్గినట్లే కన్పించింది. కానీ ఉప ఎన్నికలలో గెలుపు, వరసబెట్టి జరుగుతున్న విషాదకర ఆత్మహత్యలు చల్లారిన నిప్పును మళ్లీ రాజేశాయి. టిఆర్ఎస్‌కు కొత్త వూపిరి వచ్చింది. జెఎసి నేత కోదండరాం మళ్లీ టీవీ ఛానళ్లలో కన్పిస్తున్నాడు. ఈ సమస్యకు ఏదో ఒక పరిష్కారం కనుగొనక తప్పదన్న భావన అటు కేంద్రంలో, ఇటు రాష్ట్రంలో అన్నివర్గాల నేతలలోను రేకెత్తుతున్నది. కాంగ్రెస్ పార్టీ మరింత తీవ్రంగా ఈ అంశాన్ని పరిశీలిస్తున్నట్లు వినికిడి. తెలంగాణ ఇవ్వడమా, మానడమా అన్న నిర్ణయానికి రాక తప్పదని అందరికీ అర్థమౌతున్నది. ఈ పరిస్థితికి కారణం – తెలంగాణ ప్రజలలో వున్న బలీయమైన ఆకాంక్ష. కేవలం టిఆర్ఎస్ ప్రేరణతో ఉద్యమం నడిచేటట్లయితే ఇంతకాలం ఈ రావణ కాష్టం తగలబడేది కాదు. కానీ ప్రజలలో ఆ కోరిక పాతుకపోవడం వల్ల టిఆర్ఎస్ చేవచచ్చినా ఉద్యమం మాత్రం సజీవంగా చిగుర్లు తొడుగుతూ వుంది. ఉపఎన్నికల ఫలితాలే అందుకొక నిదర్శనం.

ప్రజాభిప్రాయానికి ఎదురొడ్డి నిలవడం ఏ రాజకీయ పార్టీకి కూడా అలివి కాని పని. ప్రజలెంత బలీయంగా ఆకాంక్షించినా దాదాపు పన్నెండేళ్ల కాలం ఆ కోరికను అణిచి పెట్టింది కాంగ్రెస్ పార్టీ. దాని వల్ల అటు తెలంగాణ ప్రజలు చాలా నష్టపోయారు. ఎన్నో ప్రాణాలు బలైనాయి. ప్రజల జీవనం కలత చెందే, కల్లోలమయ్యే స్థాయిలో ఉద్యమం నడిచింది. పారిశ్రామికంగా ఆ ప్రాంతం ఒక దశాబ్దం పాటు వెనుకపడింది. కొత్తవి రాకపోవడమే కాదు, వున్నవి కూడా వలస వెళ్లే పరిస్థితి. హైదరాబాద్ నగరం కూడా ఆ ప్రభావానికి లోనైంది. రియల్ ఎస్టేట్ వ్యాపారులు కోలుకోలేని దెబ్బ తిన్నారు. ఇళ్ల ధరలు దారుణంగా పడిపోయి సాధారణ ప్రజలు సైతం ఆర్థికంగా బాధలనుభవిస్తున్నారు. ఎంత అవసరం పడినా స్వంత ఆస్తులు అమ్ముకోలేని దుస్థితిని ఎదుర్కొంటున్నారు హైదరాబాద్ వాసులు. ఈ అనిశ్చిత స్థితి వల్లనే కాంగ్రెస్‌ను అంత కఠినంగా శిక్షించారు, మొన్నటి ఉపఎన్నికలలో. రేపు 2014లో కూడా కాంగ్రెస్ ఈ స్థాయిలో అపరాధం చెల్లించక తప్పదు. ఢిల్లీ నేతలకు ఆ విషయం బాగా అర్థమైంది. అందువల్లనే ఏదో ఒక నిర్ణయం తీసుకోక తప్పదనే భావనకు వచ్చారు.

కాంగ్రెస్ అధిష్టానంలోని బలమైన వర్గం తెలంగాణ ఇవ్వాలన్న వాదనకే మొగ్గు చూపుతున్నదని వినికిడి. పార్టీని కాపాడుకోవాలన్నా, ప్రజల ఆకాంక్షలకు వ్యతిరేకంగా నడిచామన్న నింద పడకుండా చూసుకోవాలన్నా అదొక్కటే మార్గమని ఈ వర్గం అభిప్రాయం. అయితే దానివల్ల ఎదురయ్యే పరిణామాలు ఏమిటన్నది ప్రశ్న. ఉత్తరప్రదేశ్‌ను నాలుగు రాష్ట్రాలుగా చీల్చాలని మాయావతి ప్రతిపాదించింది. దాన్ని బిజెపితో సహా కీలక పార్టీలన్నీ వ్యతిరేకిస్తున్నాయి. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు సమ్మతిస్తే ఉత్తరప్రదేశ్‌లో కూడా మాయావతి అలజడి రేపవచ్చునన్న భయం ఒకటి వుంది. దానికంటే అధికంగా మిత్రపక్షమైన తృణమూల్ కాంగ్రెస్ తెలంగాణ ఏర్పాటుకు అనుకూలం కాదు. అదే జరిగితే తన రాష్ట్రంలోని డార్జిలింగ్ వేర్పాటు వాదం మళ్లీ మొలకెత్తుతుందన్నది మమతా బెనర్జీ భయం. ఆమె మాట కాదని ఇంత కీలక నిర్ణయం తీసుకొనే స్థితిలో కేంద్ర ప్రభుత్వం లేదు. రైల్వే టిక్కెట్ల రేటు పెంపు విషయంలోనే ఆమె ప్రభుత్వాన్ని పడగొడతానన్న స్థాయిలో బెదరింపులకు దిగారు. తెలంగాణకు సైతం అదే ధోరణి అవలంభిస్తే అసలుకే మోసం వస్తుంది.

అయితే తుమ్మితే వూడే ముక్కు వంటి మిత్రపక్షంతో ఎంతకాలం సర్దుకొని పోవాలి అన్న వాదన కూడా కాంగ్రెస్‌లో వుంది. ప్రతి దానికీ మమత బెదరింపులకు దిగడం సమర్థనీయం కాదని, దాని వల్ల కేంద్ర ప్రభుత్వం బలహీనమైపోయిందన్న అభిప్రాయం ప్రజలలో ప్రచారమౌతుందని, దీంతో జరిగే నష్టం ఇంకా పెద్దదని భావిస్తున్నారు.

తెలంగాణ ఇవ్వకుంటే మేము పార్టీలో కొనసాగలేమని ఆ ప్రాంతం నేతలు ఖచ్చితంగా తేల్చి చెప్పేస్తున్నారు. తెలంగాణ ఇచ్చి, కెసిఆర్‌తో పొత్తు పెట్టుకొని రేపటి ఎన్నికలలో పోటీ చేస్తే తెలంగాణ మొత్తం స్థానాలు గెల్చుకొని రాగలమని, మమతా వల్ల జరిగే నష్టాన్ని ఆ రకంగా పూడ్చుకోవచ్చునని వీరి వాదన. తెలంగాణలో బలంగా వుందన్న సంకేతం అందితే ఆంధ్ర ప్రాంతంలో కూడా కాంగ్రెస్ పరిస్థితి మెరుగు పడుతుందని చెప్తున్నారు.

## మిస్టరీగా మారిన జగన్ అరెస్ట్!

జగన్‌ను అరెస్ట్ చేస్తారా, చెయ్యరా? మిలియన్ డాలర్ల ప్రశ్న ఇది. రాష్ట్రమంతా దీనిపైనే చర్చ నడుస్తున్నది. సాధారణ జనం కూడా అదే మాట్లాడుకొంటున్నారు. మూడు నెలల క్రితం జగన్ అక్రమ ఆస్తులపై సిబిఐ విచారణ ప్రారంభించినప్పటి నుంచి ఈ ప్రశ్న వినవస్తూనే వుంది. ఎఫ్ఐఆర్‌లో ఆయన మొదటి ముద్దాయి కాబట్టి, రెండవ ముద్దాయి అయిన విజయసాయి రెడ్డిని అరెస్ట్ చేశారు కాబట్టి, జగన్‌ను కూడా జైలుకు పంపడం ఖాయమనే వాదనలు చాలాకాలం నడిచాయి. కానీ ఎఫ్ఐఆర్ దశ దాటి ఛార్జిషీట్ దాఖలు చేసే దశ వచ్చినా సిబిఐ అందుకు పూనుకోలేదు. దానితో అందరికీ ఈ అరెస్ట్‌పై ఆసక్తి పెరిగిపోయింది. ఒక దశలో జగన్ కూడా అరెస్టుకు సిద్ధమైనాడు. తన తల్లి విజయలక్ష్మికి పార్టీ బాధ్యతలు అప్ప చెప్పాడు. అనుచర వర్గాన్నంతా అందుకు మానసికంగా సిద్ధం చేశాడు. ఒకరోజు రాత్రి ఒంగోలులో తనను అరెస్టు చేయబోతున్నారన్న వదంతి పొక్కడంతో కొంత ఆందోళనకు గురైనాడు కూడా.

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్




అయ్యగార్కి విద్యుత్ షాక్‌లు తప్ప
బిల్లుల షాక్ తగిలినట్లులేదు సుశీ...!

# శాసనసభ పతనం

మన రాష్ట్ర శాసనసభ తీరు నానాటికీ తీసికట్టుగా మారుతున్నది. నవ్వులాటగా తయారౌతున్నది. ప్రజాస్వామిక ప్రహసనంగా మిగిలిపోతున్నది. స్వాతంత్ర్యం వచ్చిన వెంటనే ఆనాటి జాతి నేతలకు ఎదురైన ప్రధాన ప్రశ్న – పాలన ఎట్లా సాగించాలి అన్నది. భిన్న జాతులు, మతాలు, భాషలు, సంస్కృతులు కలగలసిన భారతదేశంలో పరిపాలనా వ్యవస్థ రూపకల్పన అంత సులభం కాదని వారికి తెలుసు. భిన్న వర్గాల ప్రజల ఆశలు, ఆకాంక్షలు ప్రతిఫలిస్తూ, ప్రజలు చురుకైన భాగస్వామ్యం వహించే పాలనా వ్యవస్థకు పార్లమెంటరీ ప్రజాస్వామ్యమే సరైనదని నిర్ణయించారు వారు. ఆనాటికి దేశంలో వున్న నిరక్షరాస్యతను ఎత్తి చూపి, ప్రపంచ దేశాలన్నీ భారతీయులకు ప్రజాస్వామ్యం తగినది కాదని పెదవి విరిచాయి. అయితే భారతీయులలో ఎంత ప్రగాఢమైన ప్రజాస్వామిక వాంఛ వుందో ఈ అరవై ఏళ్లలో స్పష్టంగా నిరూపితమైనది. కుల పరంగా, మత పరంగా, భాషాపరంగా, జాతివిద్వేష పరంగా, ప్రాంతీయ దురభిమాన పరంగా దేశంలో ఎన్ని ఆందోళనలు తలెత్తినా, ఎంత తీవ్రస్థాయిలో రాజకీయ, సామాజిక కల్లోలాలు చెలరేగినా మన పాలనా వ్యవస్థ మాత్రం పటిష్టంగా నిలబడి, కాల పరీక్షలో విజయం సాధించింది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి హృదయం వంటివి– చట్ట సభలు. ప్రజల ఆశలు, ఆకాంక్షలకు అవి వేదికలు. ప్రజల అవసరాలకు అవి ఉపకరణాలు. ప్రజల మనోభావాలకు అవి ప్రతీకలు. కానీ దురదృష్టవశాత్తు మన రాష్ట్ర శాసనసభ రాజ్యాంగ నిర్మాతల సత్సంకల్పాన్ని, భవిష్య దృష్టిని దారుణంగా దెబ్బ తీస్తున్నది.

జమీన్‌రైతు

1983లో ఎన్టీఆర్ అధికారంలోకి వచ్చే వరకు ఆంధ్రప్రదేశ్ శాసనసభ అంటే దేశంలోనే ఒక ప్రత్యేక గౌరవం వుండేది. తరిమెల నాగిరెడ్డి, సర్దార్ గౌతు లచ్చన్న, పుచ్చలపల్లి సుందరయ్య, తెన్నేటి విశ్వనాధం, టంగుటూరి ప్రకాశం పంతులు వంటి మహా మహులెందరో శాసనసభ ప్రతిష్ట పెరగడానికి తమ వంతు కృషి చేశారు. సభలో జరిగే చర్చలకు దిశా నిర్దేశం చేయడంలో, వాటిలో ప్రజల ప్రయోజనాలను ప్రతిఫలింప చేయడంలో, ప్రభుత్వాల నడవడికను నిగ్రహించడంలో వారు కీలకమైన పాత్ర పోషించారు. శాసనసభ అంటే ప్రజా ప్రయోజనాలను ప్రతిఫలింప చేసే వేదిక అన్న ప్రజాస్వామిక స్ఫూర్తిని ధృవపరిచారు. కానీ ఎన్టీఆర్ హయాంలో ప్రారంభమైన రాజకీయ పరిణామాలు ఆ సత్సాంప్రదాయానికి గండి కొట్టాయి. నాదెండ్ల ఉదంతం తొలిసారిగా శాసనసభ ప్రతిష్టను మంట కలిపింది. అప్పటి నుంచి అన్నీ జారుడు మెట్లే. ఇప్పటి పరిస్థితి చూస్తే పతనానికి ఇంతకంటే లోతు మిగలదేమో అన్పిస్తున్నది. గత మూడేళ్లుగా శాసనసభ కేవలం రాజ్యాంగ లాంచనంగా మాత్రమే నడుస్తున్నది. సభ వ్యవహారాలలో కీలకమైనది – ప్రశ్నోత్తరాల సమయం. ఎమ్మెల్యేలు వేసే ప్రశ్నల మీద తీవ్రస్థాయి చర్చలు జరిగి, ఆయా ప్రాంతం ప్రజల అవసరాలు ప్రభుత్వ దృష్టికి వచ్చేవి. కానీ ఇప్పుడు అసలు ఆ ప్రశ్నోత్తరాలే లేవు. సభ మొదలు కాగానే, ఏదో ఒక అంశం మీద వివాదం రేకెత్తించి, గంటలు గంటలు కాలం వృధా చేసి, ప్రశ్నోత్తరాలను రద్దు చేయించడం పరిపాటిగా మారింది. బడ్జెట్ మీద కానీ, దానిలోని వివిధ పద్దుల మీద కానీ కనీస పాటి చర్చ జరగడం లేదు. అటు ప్రతిపక్షాలు, ఇటు ప్రభుత్వ పక్షం కూడా తమ ఆధిపత్యం ప్రదర్శించుకోవడానికి, ఒకరి మీద ఒకరు రాజకీయంగా పైచెయ్యి సాధించడానికి మాత్రమే ప్రాధాన్యత ఇస్తున్నారు. సభలో జరిగే ప్రసంగాలన్నీ వ్యక్తిగత దూషణలకు పరిమితమౌతున్నాయి. ఇటీవల కొంతకాలంగా ఈ ధోరణి మరింత ముదిరిపోయింది. కిరణ్‌కుమార్‌రెడ్డితో తనకు లాలూచీ లేదన్పించుకోవడానికి అరుపులు, కేకలతో సభను కకావికలు చేస్తున్నది ప్రధాన ప్రతిపక్ష పార్టీ. టిఆర్ఎస్ వంటి వారు తమ ఆందోళనకు దాన్నొక వేదికగా మార్చుకొంటున్నారు. కమ్యూనిస్టులకు అసలు గొంతు విప్పే అవకాశమే లేకుండా పోయింది. ఒకరు కూడా ప్రజల కోసం ప్రభుత్వాన్ని నిలదీయడం లేదు. ఒక్క పార్టీ కూడా ప్రజల కోసం మాట్లాడడం లేదు. అంతా రాజకీయ బురద చల్లుడు కార్యక్రమం మాత్రమే. ఇదే పద్ధతి కొనసాగితే బీహార్ వంటి అరాచక అసెంబ్లీలను మించి పోతుంది మన సభ కూడా.

ఈ తీరు మారాలి. ఈ ధోరణి మార్చి తీరాలి. ప్రభుత్వ, ప్రతిపక్షాలు రెండూ తమ పద్ధతి మార్చుకోకుంటే ప్రజాద్రోహులుగా మిగిలిపోతారు. ప్రజాస్వామ్య హంతకులుగా చరిత్రలో చెడ్డ పేరు తెచ్చుకొంటారు.

## జనవాణి

### కోవూరు ఫలితం పునరావృతమవుతుంది!

ఇటీవల జరిగిన కోవూరు ఉపఎన్నికల్లో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ తరపున పోటీ చేసిన నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి విజయం సాధించారు. రేపో మాపో జరిగే నెల్లూరు పార్లమెంట్, ఉదయగిరి అసెంబ్లీ స్థానాలకు జరిగే ఉపఎన్నికల్లో ఇదే తరహా ఫలితాలు పునరావృతమవుతాయి. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అండదండలతో జగన్మోహన్‌రెడ్డి చేసిన అవినీతి యజ్ఞం సామాన్య ఓటర్ల తలకెక్కడం లేదు. మరో రెండు ఎన్నికల వరకు జగన్ గాలి వీయడం ఖాయం.

పి.అరుణకుమారి — నెల్లూరు

### దేశ పరువు పోతోంది!

గత రెండు నెలలుగా రక్షణ మంత్రిత్వశాఖకు, సైనిక దళాల ప్రధానాధికారికి మధ్య పెచ్చరిల్లుతున్న రగడ రాద్ధాంత స్థాయికి చేరుకొని దేశ పరువు తీసేవిధంగా వీధికెక్కింది. పదవీ విరమణ వయసు విషయంలో మాట నెగ్గించుకోలేకపోయానన్న ఆత్మన్యూనత కారణంగానే ఆర్మీ చీఫ్ ఈ విధంగా వ్యవహరిస్తున్నట్లు అనుమానాలు కలుగుతున్నాయి. సైన్యాధిపతి వీధినపడి దేశపరువు ప్రతిష్టలు పోగొట్టే విధంగా బహిరంగ వాఖ్యలు చేయడం తగనుగాక తగదు. ఆర్మీ చీఫ్ వికె.సింగ్‌పై ప్రభుత్వం కఠిన చర్యలు తీసుకోవాలి.

వి.సుబ్బారావు — నెల్లూరు

### దిగి పోవాల్నా?

ఈ మధ్య జరిగిన ఉపఎన్నికల్లో ఓడినందుకు కాంగ్రెస్ పార్టీలోని కొంత మంది ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి, రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు బొత్స సత్యనారాయణ దిగిపోవాలని గందరగోళం చేస్తున్నారు. ఇలా దిగిపోవాల్సి వస్తే కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ సమావేశాల్లో పార్టీ అధ్యక్ష పదవికి మహాత్మాగాంధీ గారు నిలబెట్టిన భోగరాజు పట్టాభి సీతారామయ్య ఓడి నేతాజీ సుభాస్ చంద్రబోస్ గెలిచారు. అప్పుడు గాంధీగారు కాంగ్రెస్ పార్టీ నుంచి వైదొలగలేదు. ఎప్పుడైనా ఇదే సూత్రం అనువర్తిస్తుంది. ఉపఎన్నికలు ప్రత్యేక పరిస్థితుల్లో జరిగాయి. దీని కోసం కిరణ్‌కుమార్‌రెడ్డి, బొత్స సత్యనారాయణ లిద్దరూ రాజీనామా చేసి దిగిపోవాల్సిన అవసరం లేదు.

తూపిలి వనమాలి — హైదరాబాద్

### టీవీ సీరియళ్లను నియంత్రించాలి!

టీవీల్లో వచ్చే సీరియళ్లను నియంత్రించే వ్యవస్థ లేకపోవడం దురదృష్టకరం. దరిదాపులు అన్నీ టీవీల్లో ప్రసారమయ్యే సీరియళ్లలో మహిళలను కాకలు తీరిన విలన్లుగా చూపిస్తున్నారు. ఈ సీరియళ్లు కుటుంబ వ్యవస్థపై ప్రభావం చూపే అవకాశం వుంది. వికారాబాద్‌లో ఓ మహిళను భర్త ఇటువంటి సీరి

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**10-4-1942**
**పేజీలు : 8 వెల: అణా**

### విశాఖపట్నం, కాకినాడ మీద బాంబులు!

విశాఖపట్నంలో ఐదుగురు చనిపోయిరి. 40 మంది గాయపడిరి. కాకినాడలో ఒకరు చనిపోయిరి. నలుగురికి గాయాలు.

తుదకు ప్రపంచ యుద్ధ జ్వాలలు భరత భూమిలో కూడా కాలుబెట్టినవి. మార్చి 13వ తేదీన అండమానుల నుంచి బ్రిటీషు ప్రభుత్వము వారు ఖాళీ చెయ్యడమూ, 23వ తేదీన ఈ దీవులు, నికోబారు ద్వీపములు జపానువారి స్వాధీనము ఐనవి.

ఇంతటితో ఇండియా యుద్ధరంగంగా మారిందనవచ్చును.

ఇండియాలో యుద్ధదేవత ఆంధ్రదేశంలోనే మొదట రోషరూక్షణాలను జరిపింది. ఆమెకు మనమేమి అపకారం జేశామో?

తూర్పు సముద్రంలో 6వ తేది నుండి శత్రునావలు కనపడుతున్నవి. విశాఖపట్నం మీద 6వ తేది ఉదయమొక దాడియును, సాయంత్రమొక దాడియును జరిగినవి. మొదటి దాడి 1.30కి ప్రారంభమైనది. పది విమానములకు పైన రాలేదు. 20 బాంబులు పడినవి. ఇవి హార్బరు వద్ద డాకులోనే పడినవి. కొంత నష్టము కలిగినది. 40 మందికి గాయములు తగిలినవి. ఐదుగురు చనిపోయిరి.

### కాకినాడ

కాకినాడలో మొదటిదాడి ఉదయం ఏడు గంటలకు జరిగినది. కోరమండల్ కంపెనీవారి స్టీములాంచి ఒకటి మరొక ఓడనుగొనివచ్చుచుండగా ఈ రెండు ఓడలను విమానము నుండి ఫిరంగి గుండ్లతో కాల్చినది – ఒకడు చనిపోయినాడు – నలుగురికి దెబ్బలు తగిలినవి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**6-4-1962**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### చిత్తూరులో ఆచార్య రంగా పోటీ

శ్రీ అనంత శయనం గారి రాజీనామా వల్ల ఖాళీ ఏర్పడబోయే చిత్తూరు పార్లమెంటు స్థానంలో స్వతంత్ర పార్టీ నాయకుడు ఆచార్య రంగా పోటీ చేయగలరనేది ఖాయమని భావించవచ్చు. ఈ విషయాన్ని 'స్వరాజ్య' పత్రికలో రాజాజీ ప్రస్తావించి యిలా వ్రాశారు; 'ఆచార్య రంగాను పార్లమెంటుకు ఎన్నుకొనుటకు చిత్తూరుకు అనుకొనని అవకాశం లభించింది. రంగా, మసానీ, కృపలానీ, అశోక మెహతాలేని లోక్‌సభ ఉండవలసిన విధంగా ఉండదు. చిత్తూరు జిల్లా ప్రజలు, పలుకుబడి గల దేశభాషా పత్రికలు, తమ కర్తవ్యాన్ని గుర్తించి, అనంతశయనం గారి నియోజకవర్గంలో ఆచార్య రంగా సులభంగా ఎన్నికగుటకు సహాయపడగలరని ఆశిస్తాను. కాంగ్రెస్ పక్షంగా బూర్గుల రామకృష్ణరావు గారి పేరు వినబడుతున్నది.

### నెల్లూరు ముచ్చట్లు

#### ఉరిశిక్ష

ఆత్మకూరు తాలుకా కమ్మవారిపాళెంలో 10-12-61 తేది కర్ణాటి సుబ్బమ్మను కొట్టి హత్యజేసినాడని దండా కొండయ్య మీద మోపబడిన అభియోగాన్ని జిల్లా సెషన్సు జడ్జి బి.ఆర్.చలపతిరావు గారు విచారించి, ముద్దాయికి ఉరిశిక్ష విధిస్తూ, గత నెల 31వ తేది తీర్పు జెప్పాడు. ప్రాసిక్యూషన్‌కు బి.సారంగపాణి, ముద్దాయి పక్షంగా వై.రామారావు(గూడూరు) వాదించారు.

#### ప్రిన్సిపాల్‌పై దుష్ప్రచారం

విఆర్ కాలేజి ప్రిన్సిపాలుపై దుష్ప్రచారం జరుగుతున్నది. కరపత్రాలు, పత్రికా ప్రకటనలు వెలువడినవి. వీటికి కారణం, కారకులు బహుశా ఆధిక్యత కోల్పోయిన ఉద్యోగులు; అటెండెన్సు పోగొట్టుకొన్న కొందరు విద్యార్థులు కావచ్చు.

# నెల్లూరు ముచ్చట్లు

బిత్తరుడు

## నెల్లూరులో దినేష్‌రెడ్డి

రాష్ట్ర పోలీస్ డైరక్టర్ జనరల్ వేణుంబాక దినేష్‌రెడ్డి 1వ తేదీ నెల్లూరు వచ్చారు. నెల్లూరీయుల ఆరాధ్యదైవం రంగనాయకుల స్వామి దర్శనానంతరం స్వగ్రామం తాళ్లపూడి వెళ్లారు. అనంతరం నెల్లూరు బృందావనంలోని తన చిననాటి మిత్రుడు డాక్టర్ జె.రామ్మోహన్ ఇంట్లో మధ్యాహ్న భోజనం చేశారు. క్యాప్ స్కూల్ సందర్శన అనంతరం టౌన్ హాల్‌లో 'కంచు కాగడా' పత్రిక స్థాపకుని స్మారకంగా ఏర్పాటుచేసిన లైఫ్‌టైం అచీవ్‌మెంట్ అవార్డును స్వీకరించారు. రాత్రికి నెల్లూరులోనే బసచేసిన దినేష్ రెడ్డి 2వ తేదీ ఉదయం తిరుపతి మీదుగా హైదరాబాద్ బయలుదేరి వెళ్లారు.

## కాంక్రీట్ ఇళ్లు నెల్లూరులోనే ఎక్కువ!

ప్రభుత్వం సేకరించి విడుదల చేసిన జనాభా గణాంక వివరాల్లో జిల్లాకు సంబంధించిన పలు ఆసక్తికరమైన విషయాలు వెల్లడయ్యాయి. హైదరాబాద్ తర్వాత నెల్లూరు జిల్లాలోనే అత్యధిక కాంక్రీటుతో శ్లాబువేసిన ఇళ్లున్నాయి. వీటి శాతం 63.2. మరో విషయంలోనూ నెల్లూరు పేరు విచిత్రంగా వెలిగింది. పెళ్లి గిళ్లి లేకుండా జిల్లాలో 15.4 శాతం మంది జంటలు సహజీవనం చేస్తున్నారట. ఈ వ్యవహారం ఒక్కటి చాలు నెల్లూరులో కల్చర్ ఎంతగా అభివృద్ధి చెందిందో చెప్పడానికి...

## 2014లో నేనే గెలుస్తా!

కోవూరు ఉప ఎన్నికల ఓటమి బాధ నుంచి తెలుగుదేశం పార్టీ తరపున పోటీచేసిన సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి కోలుకొన్నారు. నియోజకవర్గంలో విస్తృతంగా పర్యటిస్తూ కార్యకర్తలను కలుసుకొంటున్నారు. మొన్నటి ఎన్నికల్లో అవినీతి బకాసురుడితో తలపడ్డా. అయినా పెద్ద సంఖ్యలో పార్టీ కార్యకర్తలు నావైపు నిలబడ్డారు. 2014 ఎన్నికల్లో ఇక్కడ గెలుపునాదే. సిబిఐ ఛార్జిషీట్‌లో జగన్ ఎ1 ముద్దాయిగా నమోదు కావడంతోనే ఆయనకు బ్యాడ్ టైమ్ మొదలయ్యిందని సోమిరెడ్డి జోస్యం చెప్పారు.

## విద్యుత్ ఛార్జీల పెంపు సబబేనన్న వివేకా!

రాష్ట్ర ప్రభుత్వం విద్యుత్ ఛార్జీల రేటు పెంచడాన్ని నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి సమర్థించారు. 2వ తేదీ పొదలకూరురోడ్డు సెంటర్‌లో విలేకరులతో మాట్లాడుతూ గత పదేళ్లుగా కాంగ్రెస్ ప్రభుత్వం విద్యుత్ ఛార్జీలు పెంచలేదు. ఇప్పుడు సైతం 50 యూనిట్ల మేరకు విద్యుత్ వాడే పేదలకు పైసా కూడా పెంచలేదు. ఏసిలు, ఫ్రిజ్‌లు వాడుకొనే వారికి విద్యుత్ ఛార్జీల భారం పెద్ద భారం కాదని వివేకానందరెడ్డి తనదైన ధోరణిలో తుస్కారంగా వ్యాఖ్యానించారు.

## ట్రెజరీలో నిశిరాత్రి చెల్లింపులు!

ఆర్థిక సంవత్సరం ముగిసే మార్చి 31వ తేదీ సాయంత్రం తర్వాత ఆన్‌లైన్ వ్యవస్థ పనిచేయడం మొదలు పెట్టడంతో వివిధ ప్రభుత్వ శాఖల సిబ్బంది వేతనాలు, టిఏ, డిఏలు ఆ రోజు నిశిరాత్రి వరకు నెల్లూరు ట్రెజరీ అధికారులు చెల్లింపులు చేశారు. 300 కోట్ల రూపాయల మేర ఆ రోజు చెల్లింపులను బ్యాంకులు అర్ధరాత్రి వరకు చేశాయి.

## ఉరేసుకొన్న ఎంబిఏ విద్యార్థిని!

నెల్లూరు వెంకటరెడ్డినగర్‌లోని మహిళా హాస్టల్‌లో ఉంటున్న విద్యార్థిని పల్లవి(23) 1వ తేదీ అనుమానాస్పదంగా మృతి చెందడం చర్చనీయాంశమయ్యింది. ఈమె ఆదిశంకర కాలేజీలో ఎంబిఏ చదువుతుంది. ఈ యువతిది తిరుపతి. మరణానికి కారణాలను ఐదవ పట్టణ పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు.

## యువతిపై యాసిడ్ దాడి

నెల్లూరులో ఎన్నడూలేని విధంగా మండపాలవీధికి చెందిన లతాజైన్ అనే యువతిపై 1వ తేదీ యాసిడ్ దాడి జరిగింది. లతాజైన్‌కు ఏప్రెల్ 30వ తేదీ రాజస్థాన్‌లో వివాహం జరగాల్సి ఉంది. ఈమె 1వ తేదీ తన ఇంటి మిద్దెపై ఉండగా ఓ మహిళ, మరో గుర్తు తెలియని వ్యక్తి వచ్చి ఆమెపై యాసిడ్ దాడికి పాల్పడినట్లు ఆమె సోదరుడు మూడవ పట్టణ పోలీసులకు ఫిర్యాదు చేశారు.

## వికలాంగులకు సైకిళ్ల పంపిణీ

నెల్లూరు చిల్డ్రన్స్ పార్కులో వాకర్స్ వెల్ఫేర్ అసోసియేషన్ నేతృత్వంలో ఉచిత వైద్య శిబిరం జరిగింది. 400 మందికి షుగర్, బిపి టెస్టులు చేసి ఉచితంగా మందులు పంపిణీ చేశారు. ఈ సందర్భంగా రంగనాయకులస్వామి దేవస్థానం మాజీ కార్యనిర్వహణాధికారి గుమ్మినేని ప్రభాకర్ కుమారుడు అమెరికాలో శాస్త్రవేత్త సాగరేశ్వర్, కుమార్తె సౌత్ ఆఫ్రికాలో స్థిరపడ్డ పువ్వుల వాణిశ్రీకాంత్‌లు ఇద్దరు పేద వికలాంగులకు మూడు చక్రాల సైకిళ్లు తీసిచ్చి తమలోని ఉదార హృదయాన్ని చాటారు.

## సమాచార హక్కు సమీక్షా సమావేశం

సమాచార హక్కు ప్రచార సాధన సమితి సభ్యులు డిఆర్వో రామిరెడ్డిని కలిసి ఆర్‌టిఐ చట్టంపై ప్రతి మూడు నెలలకోసారి సమీక్షా సమావేశం నిర్వహించమని కోరారు. డిఆర్వోను కలసిన సమితి సభ్యులలో వాస్తు రామచంద్ర, రావూరి రమేష్, సి.హెచ్.యుగంధర్, అంజయ్యనాయుడు, ప్రభాకర్, సీతారామరాజు, బేగ్ తదితరులున్నారు.

## నాజ్ జ్యూయలరీ ప్రారంభం 16న!

30 ఏళ్ల క్రితం నెల్లూరులో న్యూ ఆంధ్రా జ్యుయలరీ స్థాపించిన ఫేవర్ చంద్‌జైన్ నమ్మకమైన నగల వర్తకునిగా ఎంతో జనాభిమానం పొందారు. ఆయన వారసులు ఆచారి వీధిలోని హోటల్ అభిరామ్ ప్రక్కన అత్యాధునికంగా కట్టిన తమ భవనంలోనికి న్యూ ఆంధ్రా జ్యుయలరీని నాజ్ జ్యుయలరీగా పేరుమార్చి ఏప్రెల్ 16వ తేదీ ప్రారంభించనున్నారు. ఈ నూతన షోరూం ప్రారంభోత్సవానికి ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి, రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి, సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, మాజీ మేయర్ భానుశ్రీ విచ్చేస్తారు. తమను అభిమానించే నెల్లూరీయులందరినీ ఈ కార్యక్రమానికి తరలి రమ్మంటున్నారు నాజ్ జ్యుయలరీ అధినేతలు లలిత్‌జైన్, అనితజైన్, నిఖిల్‌జైన్.



బోగోలులో కాంగ్రెస్ పార్టీ కార్యాలయాన్ని ప్రారంభించి మాట్లాడుతున్న మాజీ ఎమ్మెల్యే కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి. వేదికపై దామిశెట్టి శ్రీనివాసులు నాయుడు, బాలకృష్ణంరాజు, కర్రెద్దుల రమేష్.

## జాతీయ సమైక్యత క్యాంప్‌కు నెల్లూరీయులు!

నెహ్రూ యువ కేంద్రం ఆధ్వర్యంలో అరుణాచల్‌ప్రదేశ్ రాష్ట్రంలోని సిమ్లా పట్టణంలో జరిగిన జాతీయ సమైక్యత శిబిరానికి నెల్లూరు నుండి పినాకినీ యూత్ వెల్ఫేర్ అసోసియేషన్ సంస్థ నిర్వాహకుడు మురళీమోహన్‌రాజు నేతృత్వంలో ప్రత్యేక బృందం వెళ్లి పాల్గొనింది. వీరు ఈ శిబిరంలో ఆంధ్ర రాష్ట్ర సంస్కృతీ సాంప్రదాయాలను తెలియజేశారు.

## ప్రభవలో ప్రత్యేక తగ్గింపు

నెల్లూరు పొగతోటలోని ప్రభవ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని అన్ని పుస్తకాలపై 10 శాతం, పిల్లల పుస్తకాలపై 20శాతం, హిందీ పుస్తకాలపై 50శాతం, హ్యాండ్‌ల్యూమ్స్‌పై 50శాతం, హ్యాండీక్రాఫ్ట్స్‌పై 50శాతం, పోచంపల్లి చీరలు, చుడీదార్లు, దుప్పట్లు, తువాళ్లపై 15 శాతం, మెన్స్‌రెడీమేడ్స్‌పై 50 శాతం ప్రత్యేక తగ్గింపు ధరలకు దొరుగుతాయి. నెల్లూరు ప్రజలు ఈ అవకాశాన్ని వినియోగించుకోమంటున్నారు ప్రభవ నిర్వాహకురాలు చంద్రలత.

కొరవ 14వ పేజీలో

# సామాన్యుల ఆస్తులు ధ్వంసం - పెద్దల ఆస్తుల జోలికి వెళ్లరు!

## నెల్లూరులో రోడ్ల విస్తరణ తీరిది!


బొల్లినేని హాస్పిటల్ ఎదురుగా ధ్వంసమైన సామాన్యుల అంగళ్లు.


సన్నీహైట్స్ హోటల్ ప్రహరీ చెదరకుండా వేసిన సిమెంటు రోడ్డు.

అయిన వారికి ఆకుల్లో, కాని వారికి కంచాల్లో సామెతను గుర్తుచేస్తూ నెల్లూరు నగరంలో ట్రంకురోడ్డు విస్తరణ పనులు జరుగుతున్నాయి. బొల్లినేని హాస్పిటల్ ముందున్న సన్నీహైట్స్ హోటల్ నుంచి శబరి శ్రీరామక్షేత్రం వరకు ట్రంకురోడ్డును సిమెంటు రోడ్డులా ఇరువైపులా విస్తరించే పనులు గత ఆరు నెలల నుంచి జరుగుతున్నాయి. రోడ్డుకు ఇరుప్రక్కలా బాగా డబ్బున్న వారితోపాటు సామాన్య, మధ్య తరగతీయుల అంగళ్లు, బ్యాంకులు, పెట్రోల్ బంకులు, వివిధ స్కూటర్ల కంపెనీల షోరూంలు, మునిసిపల్ స్కూళ్లు ఉన్నాయి. విస్తరణ నిబంధనలంటూ రోడ్డుకు పడమరవైపు పట్టాస్థలాల్లోని ఆస్తులను ధ్వంసరచన చేసి రోడ్డును విస్తరించారు. తూర్పువైపు మాత్రం నిబంధనలను సన్నీహైట్స్ హోటల్ ముందు, ప్రక్క నుంచి వెళ్లే కాల్వలో వేసి పాతిపెట్టారు. ఈ హోటల్ యాజమాన్యం నీటిపారుదల శాఖ స్థలాన్ని ఆక్రమించి హోటల్ ముందు భాగంలో పార్కింగ్‌కు చేసిన ఏర్పాటును రోడ్డు విస్తరణలో పొరపాటున కూడా రోడ్లు భవనాల శాఖ అధికారులు కదిలించలేక పోయారు. దీనివల్ల ఈ ప్రాంతంలో రోడ్డు కుంచించుకపోయింది. మొత్తం మీద విస్తరణ చేసి ప్రయోజనం లేకుండా పోయింది. చిన్నాచితకా వ్యాపారస్తుల అంగళ్లు పగులగొట్టి హోటల్ దగ్గర ఎంతో ఇరుకుగా ఉన్నా వదలివేయడం ఈ మార్గంలో వెళ్తున్న ప్రతి ఒక్కరికీ కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. కానీ ఈ మార్గాన తిరిగే ఒక్క జిల్లా అధికారికీ ఈ విషయం పట్టకపోవడాన్ని జనం చర్చిస్తున్నారు. ఏదో ఒక మతలబుతోనే రోడ్డు విస్తరణలో హోటల్ యాజమాన్యానికి జిల్లా యంత్రాంగం సమస్తం సలాము చేసి గులాములైనట్లు ఈ వ్యవహారం వెల్లడి చేస్తుంది.

## క్యాప్ సేవలు బేష్!

### ● ఎస్పీని ప్రశంసించిన డిజిపి



చైల్డ్ అండ్ పోలీస్ ప్రాజెక్ట్‌ను సందర్శించిన మాట్లాడుతున్న డిజిపి దినేష్‌రెడ్డి.

పిల్లల సంరక్షణకై క్యాప్ చేపడుతున్న సేవలు అభినందనీయం అని డిజిపి దినేష్‌రెడ్డి ప్రశంసించారు. 1వ తేది నెల్లూరు వచ్చిన ఆయన కొండాయపాళెం గేటు వద్ద నిర్వహిస్తున్న చైల్డ్ అండ్ పోలీస్(క్యాప్) ప్రాజెక్టును సందర్శించి అక్కడి పిల్లలతో ముచ్చటించారు. బోడిగాడితోటలో తిరిగే పిల్లలను అక్కున చేర్చుకొని వారికి విద్యాబుద్ధులు నేర్పించేందుకు ఎస్పీ రమణకుమార్ చేపట్టిన క్యాప్ రాష్ట్రంలో పలువురికి ఆదర్శంగా నిలచిందన్నారు. రైల్వే ఫ్లాట్‌ఫాంలపై తిరిగే పిల్లలు, అనాధల్లా తిరిగే పిల్లలను చేరదీసి వారిని ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దేందుకు ప్రతి ఒక్కరూ బాధ్యత వహించాలన్నారు. విధివంచితులు, అనాధల పట్ల ప్రత్యేకశ్రద్ధ వహిస్తున్నట్లు చెప్పారు. క్యాప్‌కు అనుబంధంగా ఎయిడెడ్ స్కూలును ఏర్పాటు చేసేందుకుగాను తనవంతు కృషి చేస్తానని హామీ ఇచ్చారు. రాష్ట్రంలో శాంతిభద్రతల పరిరక్షణకు ప్రాధ్యాన్యమిస్తున్నామని, ఆ దిశగా చర్యలు చేపడుతున్నామన్నారు. పోలీసులు ప్రజలతో మమేకమై వారి అభిమానాన్ని చూరగొనేలా నడుచుకోవాలన్నారు. ఐజి హరీష్‌కుమార్ గుప్తా మాట్లాడుతూ నెల్లూరు క్యాప్‌ను ఆదర్శంగా తీసుకొని గుంటూరులోను ఇలాంటి దానిని ఏర్పాటు చేస్తున్నట్లు తెలిపారు. ఎస్పీ రమణకుమార్ ఈ సందర్భంగా క్యాప్ చేపడుతున్న కార్యక్రమాలను డిజిపి, ఇతర అధికారులకు వివరించారు.

## అంతా మాస్ కాపీయింగ్!

### టెన్త్ పరీక్షలు జరుగుతున్నాయిలా

ఎన్నడూలేని విధంగా జిల్లాలో పదవ తరగతి పరీక్షల్లో విచ్చలవిడిగా మాస్ కాపీయింగ్‌కు తెరలేపారు అధికారులు. కార్పొరేట్ పాఠశాలల యాజమాన్యాలతో కుమ్మక్కై ఎక్కడికక్కడ కాపీయింగ్‌కు లైసెన్సు ఇచ్చేయడంతో పదవ తరగతి పబ్లిక్ పరీక్షల స్వరూపమే మారిపోయింది. కార్పొరేట్, ప్రైవేట్ విద్యార్థులు పరీక్ష వ్రాసే కేంద్రాలలో అంతా మాస్ కాపీయింగే. విద్యార్థులు ఇష్టానుసారంగా పరీక్షలు వ్రాస్తుంటే అన్ని రకాలుగా తమ అండదండలు అందించడంపై సర్వత్రా ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. కొన్ని కేంద్రాలలో విద్యార్థులకు పరీక్ష వ్రాయడానికి ముందే ప్రశ్నలు తెలుసుకొని సెల్‌ఫోన్లపై సమాచారం అందిస్తున్నారట. దీంతో చివరి నిముషంలో వాటికి సమాధానాలు తెలుసుకొని తమ వారికి చేరవేసేందుకు ప్రత్యేకంగా కొంతమందిని ఏర్పాటు చేసుకొని ఉన్నారట ప్రైవేట్ విద్యాసంస్థలు. వీరికి విద్యాశాఖ అధికారుల అండదండలు ఉండడంతో వారిది ఇష్టారాజ్యం అయ్యింది. దీనిపై పలు విద్యార్థి సంఘాలు పరీక్షల నిర్వాహాధికారులకు ఫిర్యాదుచేసినా ఫలితం లేకుండా పోయింది. విద్యాశాఖ అధికారులు పరీక్షలు జరిగే సెంటర్‌లకు వెళ్లి తనిఖీచేసి అంతా బాగుందంటూ ఫోటోలకు ఫోజులివ్వడం తప్ప మాస్ కాపీయింగ్‌ను అరికట్టేందుకు చర్యలేవీ తీసుకోకపోవడంతో ప్రభుత్వ పాఠశాలల్లో చదివే విద్యార్థులు ఇబ్బందులు పడుతున్నారు.

## కానిస్టేబుళ్ల ఉద్యోగాలు ఇప్పిస్తారట!


పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో జరుగుతున్న కానిస్టేబుళ్ల దేహ దారుఢ్య పరీక్షలు.

### ● నెల్లూరులో బయలుదేరిన దళారులు

కానిస్టేబుళ్ల ఉద్యోగాలు ఇప్పిస్తామంటూ పలువురు చోటా నేతలు, దళారులు రంగ ప్రవేశంచేసి నిరుద్యోగుల నుంచి పెద్ద ఎత్తున డబ్బులు దండేస్తుండడంపై గగ్గోలు రేగుతోంది. జిల్లాలో కానిస్టేబుళ్ల ఎంపికలు జరుగుతున్నాయి. ఈ నేపథ్యంలో రాజకీయ అండదండలు, అధికారులతో తమకున్న పరిచయాలను ఆసరాగా చేసుకొని కొందరు నిరుద్యోగులను ఉద్యోగాలిప్పిస్తామంటూ మభ్యపెడుతున్నారు. కానిస్టేబుల్ పోస్టు కావాలంటే పరీక్షలు, పరుగు పోటీలతో సంబంధంలేదని తామనుకొంటే ఏదైనా చేస్తామంటూ దళారులు రంగంలోకి దిగడంతో పలువురు వీరిని ఆశ్రయిస్తున్నారు. నగరానికి చెందిన చోటా నేతలతోపాటు, ముత్తుకూరు మండలానికి చెందిన కొందరు రాష్ట్రస్థాయి పోలీస్ విభాగంలో తమకు మంచి సంబంధాలున్నాయంటూ చెప్పి లక్షలు వసూలు చేస్తున్నారట. కానిస్టేబుల్ ఉద్యోగం రావాంటే నాలుగు లక్షల రూపాయలు ఖర్చు అవుతుందని, ముందుగా లక్ష రూపాయలు అడ్వాన్స్‌గా చెల్లించాలంటూ ఆ మొత్తాలు వసూలు చేస్తున్నారట. దీనిపై పెద్ద ఎత్తున విమర్శలు రావడంతో ఎస్పీ రమణకుమార్ స్వయంగా అలాంటి వారి మాటలు నమ్మవద్దని, ఎంపికలు పారదర్శకంగా జరుపుతున్నామని ప్రకటించాల్సి వచ్చింది. మొత్తంమీద కానిస్టేబుళ్ల ఎంపికలు పలువురికి కాసులు కురిపిస్తున్నాయి.

## బంగారు కొనుగోళ్లపై పన్ను ఎత్తివేయాలి!


ఒంగోలు ఎమ్పీ మాగుంట శ్రీనివాసులురెడ్డికి వినతిపత్రం ఇస్తున్న అమరామోహన్‌రావు, శాంతిలాల్‌జైన్, జె.ఎల్.సత్యం, మణిలాల్‌జైన్.

బంగారు వ్యాపారస్తులపై ప్రస్తుతం విధిస్తున్న పన్నులకు తోడు సెంట్రల్ ఎక్సైజ్, టిసిఎస్ వసూలు చేయడం తక్షణం ఆపేలా కేంద్ర ప్రభుత్వంతో మాట్లాడాలని ఒంగోలు ఎమ్పీ మాగుంట శ్రీనివాసులురెడ్డిని నెల్లూరు బులియన్ అండ్ డైమండ్ మర్చంట్స్ అసోసియేషన్ అధ్యక్షుడు శాంతిలాల్‌జైన్ అభ్యర్థించారు. మార్చి 31వ తేది నెల్లూరులో ఉండిన ఎమ్పీని సంఘ సభ్యులు కలిశారు. ప్రభుత్వం తీసుకొన్న నిర్ణయం మూలంగా బంగారు వ్యాపారులతోపాటు వినియోగదారులు కూడా నష్టపోయే అవకాశం ఉందన్నారు. ఇప్పటికే బంగారు వ్యాపారస్తులు క్రమం తప్పకుండా వివిధ పన్నులు కడుతున్నారని కొత్త పన్నులు కడుతూ ఏ ఒక్కరూ వ్యాపారం చేయలేరన్నారు. ఈ విషయాన్ని కేంద్ర ఆర్థిక మంత్రి ప్రణబ్‌ముఖర్జీ దృష్టికి తీసుకెళ్లి సత్వర న్యాయం చేకూరేలా చర్యలు తీసుకొంటానని మాగుంట శ్రీనివాసులురెడ్డి బంగారు వ్యాపారస్తులకు హామీ ఇచ్చారు. ఎమ్పీని కలసిన ప్రతినిధి బృందంలో మణిలాల్‌జైన్, ప్రసన్నాంజనేయులు, జె.ఎల్.సత్యం, అమరా మోహన్‌రావు తదితరులున్నారు.

● అణు శాస్త్రవేత్తగా

# కోడూరు యువకుడు!

కృషి, పట్టుదల వుంటే సాధించలేనిది ఏమీ లేదని నిరూపిస్తున్నాడు తమిళనాడు కల్పకం అణుశాస్త్ర పరిశోధనా కేంద్రంలో శాస్త్రవేత్తగా పనిచేస్తున్న తోటపల్లి గూడూరు మండలం కోడూరు పట్టపుపాళానికి చెందిన పామంచి మహేష్‌కుమార్. పామంచి గోపి, శ్యామలమ్మల కుమారుడైన మహేష్ చిన్ననాటి నుంచి కష్టపడి చదివేవాడు. కోడూరు, ఇందుకూరుపేటల్లో ప్రాధమిక విద్య అభ్యసించి, నవోదయలో ఇంటర్ పూర్తి చేశాడు. అనంతరం తిరుపతి ఎస్‌వి యూనివర్శిటీలో కెమికల్ ఇంజనీరింగ్ చేసి, తర్వాత తమిళనాడు ఐఐటిలో పిజి చేశాడు. కష్టపడి చదివించిన తల్లిదండ్రుల కలలు సార్ధకం చేయాలన్న పట్టుదలతో అటామిక్ రీసెర్చ్ సెంటర్‌లో శాస్త్రవేత్త అయినాడు. మహేష్ ఉన్నతిని చూసిన స్థానికులు అభినందిస్తున్నారు.

**కష్టేఫలికి నిదర్శనం**

# డిసిపల్లెలో పొగాకు కొనుగోళ్లు!

మర్రిపాడు మండలం డిసిపల్లి పొగాకు వేలం కేంద్రంలో 504 పొగాకు బేళ్లు కొనుగోలు చేశారు. మొత్తం 549 బేళ్లు రాగా వివిధ కారణాల వల్ల 45 బేళ్లను నిరాకరించినట్లు వేలం నిర్వహణాధికారి ఎస్.కె కాలేషా తెలిపారు. వీటి గరిష్ట ధర 110 రూపాయలు, కనిష్టంగా 60 రూపాయల ధర పలికిందన్నారు. సగటు ధర 103.50గా నమోదైందన్నారు. పొగాకు నాణ్యతను ఎస్‌బి 23, ఎస్‌ఎస్ 3, ఆర్‌ఆర్6, సిఆర్ 13గా పరిగణించామన్నారు. మొత్తం ఎనిమిది కంపెనీల నుంచి ప్రతినిధులు పోటీలో పాల్గొన్నారని ఆయన చెప్పారు.

# అంగన్‌వాడీ కేంద్రాలు బాగాలేవు

అంగన్‌వాడీ కేంద్రాల పనితీరుపై పలు ఫిర్యాదులు వస్తున్న నేపథ్యంలో ఆ శాఖ రీజినల్ జాయింట్ డైరెక్టర్ సూయిజ్ తనిఖీలు జరిపారు. ఇటీవల జిల్లాకు వచ్చిన ఆమె పలు కేంద్రాలను పరిశీలించారు. వెంకటాచలం ప్రాజెక్టు పరిధిలో గల వివిధ అంగన్‌వాడి సెంటర్లకు వెళ్లిన సూయిజ్ అక్కడి సిబ్బంది పనితీరు, జిల్లా అధికారుల పర్యవేక్షణపై తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. ఈ సందర్భంగా ఆమె మాట్లాడుతూ దాదాపు 91 కేంద్రాలను పరిశీలించగా అధిక భాగం కేంద్రాల్లో సిబ్బంది పనితీరు బాగోలేదన్నారు. నిర్లక్ష్యంగా పనిచేసే సిబ్బందికి నోటీసులిచ్చి అప్పటికీ వారి ప్రవర్తనలో మార్పు రాకపోతే కొత్తవారిని నియమిస్తామన్నారు. కొత్త భవనాల ఏర్పాటు, ఖాళీగా వున్న పోస్టులను త్వరలో భర్తీ చేస్తామన్నారు.

**రీజనల్ జాయింట్ డైరెక్టర్ ప్రకటన**

● కలువాయిలో

# అబందరగా టెన్త్ పరీక్షలు

కలువాయి మండలంలో పదవతరగతి పరీక్షల నిర్వహణ అస్తవ్యస్తంగా మారింది. ఎవరికి వారు తమ విద్యార్థుల కోసం అడ్డదారులు తొక్కుతుండడం, ఈ క్రమంలో ఒకరినొకరు విమర్శించుకొంటుండడంతో పరీక్షల తీరు మారిపోయింది. స్థానికంగా వుండే ప్రైవేట్ పాఠశాల యాజమాన్యానికి, ప్రభుత్వ పాఠశాలల ఉపాధ్యాయులకు మధ్య జరుగుతున్న వివాదంలో పరీక్షల పరువు బజారు పాలైంది. ప్రైవేట్ పాఠశాల విద్యార్థులందరూ ప్రభుత్వ పాఠశాలలో పరీక్షలు వ్రాస్తున్నారు. అక్కడి విద్యార్థులు ప్రైవేట్ పాఠశాలలో పరీక్షలు వ్రాయడం జరుగుతోంది. ప్రైవేటు పాఠశాల సెంటర్‌లో బిట్‌పేపర్ చెప్పేస్తున్నారు. కానీ ప్రభుత్వ పాఠశాలల్లో ఇది జరగడం ఇరువురి మధ్య గొడవకు కారణమైంది. దీంతో పరీక్షల్లో జరుగుతున్న అక్రమాలు బయటపడ్డాయి. మరోవైపు ప్రభుత్వ టీచర్లు కొందరు తమ పిల్లలు చదివే ప్రైవేట్ పాఠశాలతో కుమ్మక్కు కావడంతో అస్తవ్యస్తంగా మారింది. ప్రతి ఏడాది జరిగే అక్రమాల వలన నిఖార్సుగా చదివి పరీక్షలు వ్రాసే విద్యార్థులు తీవ్రంగా నష్టపోతున్నారు.

**కాపీ చేయించను పోటీపడ్డారు**

# రోడ్డు నిర్మాణంపై వివాదం!

కావలిలో రోడ్డు నిర్మాణంపై తలెత్తిన వివాదం కాంగ్రెస్ పార్టీ నేతకు, ఇతర పార్టీల మధ్య వివాదంగా మారింది. పట్టణంలోని ఉత్తర శివార్లలో వున్న గాయత్రినగర్ ప్రాంతంలోని ఇషాక్‌మియా వీధిలో సిమెంటురోడ్డును నిర్మిస్తున్నారు. కాంగ్రెస్ సీనియర్ నేత దామిశెట్టి శ్రీనివాసులునాయుడు సొంత స్థలంలో 30 అంకణాలు రోడ్డు కోసం ఇచ్చారు. దీనిపై మునిసిపల్ కౌన్సిల్‌లో తీర్మానం కూడా జరిగింది. ఇటీవల రోడ్డు పనులు ప్రారంభించగానే దామిశెట్టి బ్రదర్స్ పనులను అడ్డుకొన్నారు.

తాము ఇచ్చిన స్థలంలో రోడ్డును నిర్మించరాదంటూ రాద్ధాంతం చేశారు. దీంతో స్థానికులు ఆర్‌డిఓకు ఫిర్యాదు చేయగా, ఆయన మునిసిపల్ కమిషనర్‌కు తెలిపి రోడ్డు నిర్మాణ పనులు పూర్తి చేయించాలని ఆదేశించారు. అయినప్పటికి దామిశెట్టి బ్రదర్స్ తమ పంతం వీడలేదు. దీంతో ప్రజల సౌకర్యం కోసం నిర్మిస్తున్న రోడ్డు పనులను నిలపడంపై తెలుగుదేశం, బిజెపి, వైఎస్‌ఆర్ కాంగ్రెస్, వామపక్ష పార్టీలు స్థానికులకు అండగా నిలిచాయి. దీంతో ఉద్రిక్తత నెలకొంది. స్థానికులు మాత్రం భూముల ధరలు పెరగడం వలననే దామిశెట్టి బ్రదర్స్ తమ స్థలంలో రోడ్డు నిర్మించకూడదని అడ్డు తగులుతున్నారని ఆరోపిస్తున్నారు.

**కావలిలో వీధినపడ్డ దామిశెట్టి బ్రదర్స్**

## కావలిలో దొంగలు బాబోయ్ దొంగలు

కావలి పట్టణంలో దొంగతనాలు జోరందుకోవడంతో ప్రజలకు కంటిమీద కునుకు లేకుండా పోతోంది. రోజు ఏదో ఒక ప్రాంతంలో దొంగతనాలు జరుగుతున్నాయి. పోలీసులు మాత్రం దొంగతనాలను అరికట్టేందుకు తగిన చర్యలు చేపడుతున్నామని చెప్తున్నా ఆచరణలో మాత్రం అందుకు విరుద్ధంగా వుంటోంది. చేతులు కాలాక ఆకులు పట్టుకొన్న చందంగా దొంగతనం జరిగాక క్లూస్ టీం రావడం, వేలిముద్రలు సేకరించడం, దొంగలను త్వరలో పట్టుకొంటామని చెప్పడం తప్ప వీటిని అరికట్టేందుకు పటిష్టమైన చర్యలు తీసుకొన్న దాఖలాలు లేవు. మరోవైపు చిన్న చిన్న దొంగతనాలు, జేబుదొంగతనాలు అధికం అయ్యాయి. బస్టాండ్లలో ప్రయాణీకుల నుంచి బ్యాగులు, ఆభరణాలు దొంగలించే ముఠాల సంచారం ఎక్కువగా వుంది. దొంగలను పట్టుకోవడంలో పోలీసు విఫలమయ్యిందనే చెప్పొచ్చు.

# సంక్షేమ ఫలాలు ప్రజలకు అందడం లేదు!

● వెంకటగిరిలో

**ఎమ్పీ చింతామోహన్**

సంక్షేమ పథకాలను ప్రభుత్వం అందిస్తున్నా క్రిందిస్థాయిలో సక్రమంగా అమలు కావడం లేదని తిరుపతి ఎమ్పీ చింతామోహన్ అసంతృప్తి వ్యక్తం చేశారు. వెంకటగిరి పట్టణం ధర్మపురంలో ప్రభుత్వ పథకాల అమలుపై అధికారులతో సమీక్షించారు. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు వేల కోట్ల రూపాయలతో ప్రజాసంక్షేమ పథకాలను అమలు చేస్తున్నా కొందరు సిబ్బంది కారణంగా అవి పేదలకు అందకుండాపోతున్నాయని, దీనిపై ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి సైతం అసంతృప్తితో వున్నారన్నారు. అందుకోసమే ఈ సమీక్ష నిర్వహిస్తున్నట్లు చెప్పిన చింతామోహన్ ఇకనైనా పథకాలు సక్రమంగా అమలయ్యేలా చూడాలన్నారు. వెంకటగిరి మండలంలో వున్న ప్రభుత్వ భూములను కాపాడాలని రెవెన్యూ అధికారులకు ఆదేశాలిచ్చారు. హరిజన, గిరిజనులకు, చదువుకొన్న వారికి తగిన సహాయ సహకారాలు అందించాలని, దళితులకు ఇంటి స్థలాలు ఇవ్వాలన్నారు. పదోతరగతి పరీక్షలు జరుగుతున్నందున విద్యార్థుల సౌకర్యాన్ని దృష్టిలో వుంచుకొని కరెంటు కోతలు విధించవద్దని డిస్కం అధికారులకు సూచించారు. వెంకటగిరి మురికివాడల అభివృద్ధికి ప్రాజెక్టు తయారు చేస్తే కేంద్రం నుంచి నిధులు మంజూరు చేయిస్తానని హామీ ఇచ్చారు. మునిసిపల్‌పాలన తీరుపై కమిషనర్ మల్లారావును అభినందించారు. పట్టణంలో వీధి లైట్ల కోసం పదిలక్షల రూపాయలను కేటాయిస్తున్నట్లు చెప్పారు. మేనకూరు సెజ్, మన్నవరం భెల్ పరిశ్రమల్లో స్థానికులకు ఉద్యోగ అవకాశాలు కల్పించేందుకు కృషి చేస్తామన్నారు. ఈ సమావేశంలో ఎస్సీ కార్పొరేషన్ ఇడి సోమయ్య తదితరులు పాల్గొన్నారు.

# 600 మార్కులకు 580 ఎలా?

**తత్వవేత్త శివరాం సందేహం**

కార్పొరేట్ విద్యాసంస్థల యాజమాన్యాలు లంచాలిచ్చి మార్కులు, ర్యాంకులు తెచ్చుకొంటున్నాయని ప్రముఖ తత్వవేత్త ఎం.శివరాం ఆరోపించారు. కావలి పట్టణంలో గల మాస్టర్ పాఠశాల వార్షికోత్సవంలో ఆయన ముఖ్యఅతిధిగా పాల్గొన్నారు. విద్య వ్యాపారంగా మారిపోయిందని, ఎవరికివారు అత్యధిక మార్కులు సాధించేందుకు అడ్డదారులు తొక్కుతున్నారని విమర్శించారు. 600లకు 580 మార్కులు, ఆపైన ఎలా వస్తున్నాయో తెలియడం లేదన్నారు. విద్యారంగంలో విప్లవాత్మక మార్పులు రావాలన్నారు. ఉపాధ్యాయులు సైతం విద్యారంగం గురించి పట్టించుకోకుండా సంఘాల పేరుతో రాజకీయాలు చేసుకొంటుండడం సిగ్గుచేటన్నారు. తమ సమస్యలపై పోరాటం చేసుకొనేందుకే సమయం సరిపోతోందని, పిల్లల చదువులు సంగతి గాలికి వదిలేశారన్నారు. రాజకీయాలలో విద్య ప్రాముఖ్యతను గుర్తించింది లోక్‌సత్తా అధినేత జయప్రకాష్ నారాయణ్ ఒక్కరేనన్నారు. ఈ కార్యక్రమంలో విశ్లేషకులు నరేంద్ర, పాఠశాల కరస్పాండెంటు ప్రభావతి తదితరులు పాల్గొన్నారు.

# కబ్జాదారులపై చర్యలు చేపట్టాలి!

ప్రభుత్వ భూములను ఆక్రమించి నకిలీ పట్టాలు సృష్టించి అమ్ముకొంటున్న వారిపై చర్యలు తీసుకోవాలని కోరుతూ కావలి ఆర్‌డిఓ కార్యాలయం వద్ద సిపిఐ ధర్నా నిర్వహించింది. ఈ ధర్నానుద్దేశించి జిల్లా సహాయ కార్యదర్శి అంకయ్య మాట్లాడుతూ కొందరు అక్రమాలకు, కబ్జాలకు పాల్పడుతూ పెద్దఎత్తున ప్రభుత్వ భూములను ఆక్రమించేస్తున్నారని ఆరోపించారు. బహిరంగంగా ఆక్రమణలకు పాల్పడుతున్నా సంబంధిత అధికారులు పట్టించుకోకపోవడంతో రోజురోజుకు ఇలాంటివి అధికం అవుతున్నాయన్నారు. దీంతో కబ్జాదారులు ఒక అడుగు ముందుకేసి ఏకంగా నకిలీ పత్రాలు సృష్టించి ప్రభుత్వ భూమిని అమ్మేసి కోట్ల రూపాయలు గడిస్తున్నారన్నారు. ఇలాంటి వాటిపై దృష్టి సారించని రెవెన్యూ అధికారులు పేదలకు ఇళ్ల స్థలాలు ఇవ్వమంటే మాత్రం భూములు లేవని చెప్తున్నారని విమర్శించారు. ఈ కార్యక్రమంలో జిల్లా నాయకులు డేగ సత్యం, బాలకోటయ్య, మాల్యాద్రి, శంకర్, ప్రవీన్‌కుమార్, రాజు, రసూల్ పాల్గొన్నారు.

● వెంకటగిరి రైల్వేస్టేషన్‌లో

# తిష్టవేసిన సమస్యలు!

దేశంలో చేనేత, నిమ్మ వ్యాపారంలో వెంకటగిరి ప్రసిద్ధి చెందింది. అలాంటి వ్యాపార కేంద్రమైన ఇక్కడ తగినన్ని రైళ్లు ఆగడం లేదు. ఫలితంగా పలు ప్రాంతాలకు వెళ్లాల్సిన వారు ఇబ్బందులు పడాల్సి వస్తోంది. ఒకవైపు రైల్వేస్టేషన్‌ను ఆధునీకరించినా, అన్ని హంగులు సమకూర్చినా రైళ్లు నిలవని కారణంగా అదంతా వ్యర్థం అవుతోంది. శ్రీకాళహస్తి– వెంకటగిరి మధ్య ప్రాధాన్యం కల్గిన రైల్వేస్టేషన్లు లేవు. సుదూర ప్రాంతాల నుంచి వచ్చే ప్రయాణీకులు అటు గూడూరు టౌన్, ఇటు రేణిగుంటలోనో దిగి అక్కడ్నుంచి బస్సులో వెంకటగిరికి రావాల్సి వస్తుండడంతో తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. మరోవైపు నిమ్మకాయల రవాణాకు తగినన్ని రైళ్లులేని కారణంగా వ్యాపారులు ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. పారిశ్రామికంగా వెంకటగిరి ప్రాంతం అభివృద్ధి చెందుతోంది. దీనిని దృష్టిలో వుంచుకొని వారణాసి, శబరి, శేషాద్రి తదితర రైళ్లను వెంకటగిరిలో స్టాపింగ్ ఇవ్వాలని చాలాకాలంగా ప్రజలు కోరుకొంటున్నారు. ప్రజాప్రతినిధులు ఈ సమస్యను పరిష్కరించి ప్రయాణీకులకు వీలు కల్పించాల్సి వుంది.

# కావలి పార్టీల్లో మొదలైన వలసలు

**• అందరినీ ఆకర్షిస్తున్న రామిరెడ్డి ప్రతాప్**

కావలి నియోజకవర్గంలోని వివిధ పార్టీల్లో వలసలు ప్రారంభమైనట్లు సమాచారం. తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీల్లో వర్గ విభేదాల కారణంగా ఆయా పార్టీల కార్యకర్తలు, మండలస్థాయి నేతలు పార్టీని వీడేందుకు సమాయత్తం అవుతున్నట్లు తెలుస్తోంది. ఇటీవల జరిగిన కోవూరు ఉపఎన్నికలలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ విజయం సాధించడంతో ఆ పార్టీలో కొత్త ఉత్సాహం వచ్చింది. ఈ నేపథ్యంలో కావలి నియోజకవర్గంలో తెలుగుదేశం, కాంగ్రెస్‌పార్టీలలో వున్న అసంతృప్తులను తమవైపు తిప్పుకొనేందుకు వైఎస్ఆర్ పార్టీ నేత రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి చాపక్రింద నీరులా తన ప్రయత్నాలు సాగిస్తున్నట్లు తెలుస్తోంది. అధికార కాంగ్రెస్ పార్టీ కంటే కూడా ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీ నేతలు పలువురు వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీలో చేరేందుకు తమవంతు ప్రయత్నాల్లో వున్నారట. ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు నియోజకవర్గంలోని ఇతర మండలాలపై దృష్టి సారించకుండా కేవలం కావలి పట్టణానికే పరిమితం అవుతూ తమ బాగోగులు పట్టించుకోవడం లేదనే బాధ వ్యక్తం చేస్తున్నారు పలువురు మండలాలకు చెందిన కార్యకర్తలు. దగదర్తి, అల్లూరు, బోగోలు, కావలి రూరల్ మండలాలకు చెందిన పలువురు అసంతృప్తులపై ప్రతాప్‌కుమార్‌రెడ్డి కన్నేసి తమపార్టీలోకి వస్తే అన్ని రకాలుగా సహాయ సహకారాలు అందిస్తామని హామీ ఇస్తున్నట్లు సమాచారం.



వికలాంగులకు ట్రై సైకిళ్లు పంపిణీ చేస్తున్న నెల్లూరు చిల్డ్రన్స్ పార్కు వాకర్స్ అసోసియేషన్ సభ్యులు గుమ్మినేని ప్రభాకర్, సుబ్రహ్మణ్య యాదవ్, బివి.నరసింహం, డాక్టర్ సుధాకర్, మురళీమోహన్ తదితరులున్నారు.

**• వెంకటగిరిలో**

## వైద్యం గగనకుసుమం!

**పేరుకే ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు**

వెంకటగిరి నియోజకవర్గంలో గల ఆరోగ్య ఉప కేంద్రాలలో వైద్య సేవలు అందకపోతుండడంతో గ్రామీణ ప్రాంతాల వారు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. వైద్యసిబ్బంది విధులకు హాజరు కాకపోవడం, వచ్చినా చుట్టపుచూపుగా వచ్చి వెళుతుండడంతో ఆరోగ్య కేంద్రాలు రోగులు వుండి డాక్టర్లు లేనివిగా వుంటున్నాయి. వెంకటగిరి మండలంలో జికెపల్లి, బంగారుపేట పరిధిలో 11 ఆరోగ్య ఉప కేంద్రాలు పనిచేస్తున్నాయి. బాలాయపల్లి మండలంలో 9, డక్కిలి మండలంలో 9 ఉప కేంద్రాలున్నాయి. పేరుకు ఇన్ని వున్నా గ్రామీణ ప్రాంతాల్లోని వారికి వైద్య సేవలు మాత్రం అందకుండా పోతున్నాయి. కొన్నిచోట్ల భవనాలు లేక మరికొన్ని చోట్ల భవన వసతి వున్నా వైద్యసిబ్బంది సరిగా విధులకు హాజరు కాకపోతుండడంతో వ్యాధినిరోధక టీకాలు, వ్యాధులను అరికట్టేందుకు ప్రభుత్వం అందజేసే మందులు ప్రజలకు అందని పరిస్థితి ఏర్పడుతోంది. పల్లెప్రజలకు మెరుగైన వైద్యసేవలు అందించాలన్న లక్ష్యంతో ప్రభుత్వం ఈ ఉప కేంద్రాలను ఏర్పాటుచేసి నిధులు మంజూరు చేస్తున్నప్పటికీ ఏమాత్రం ఉపయోగపడడం లేదు. దీనికి కారణం వైద్యసిబ్బంది నిర్లక్ష్యమేనని తెలుస్తోంది. ఈ కేంద్రాలకు వచ్చే నిధులు ఏమవుతున్నాయో తెలియడం లేదు. ఉన్నతాధికారులు జోక్యం చేసుకొని ఈ ఆరోగ్య ఉప కేంద్రాల పనితీరును మెరుగుపరచాల్సిన అవసరం ఎంతైనా వుంది.



**• గూడూరులో నాసిరకంగా**

## పైపులైన్ల ఏర్పాటు!

**భవిష్యత్తులో ఇబ్బందులు తప్పేట్లు లేవు.**

గూడూరు పట్టణ ప్రజల దాహార్తిని తీర్చేందుకు ఏర్పాటు చేస్తున్న పైపులైన్ల నిర్మాణం పరమ నాసిరకంగా జరుగుతున్నదనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. చాలాకాలంగా ఈ ప్రాంత ప్రజలు మంచినీటి కోసం తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్న సమయంలో 64కోట్ల రూపాయలతో కండలేరు నుండి నేరుగా త్రాగు నీటిని గూడూరుకు తీసుక వచ్చేందుకు నిధులు మంజూరు చేశారు. కండలేరు జలాశయం నుండి నీటిని తీసుకవచ్చేందుకు మెయిన్ పైపులైను పనులు పూర్తవగా, ప్రస్తుతం ఇంటర్నల్ పైపులైను పనులు జరుగుతున్నాయి. ఇక్కడే నాణ్యతా ప్రమాణాలకు తిలోదకాలు ఇచ్చారనే విమర్శలు వస్తున్నాయి. నీటిఎద్దడి తక్కువగా వున్న ప్రాంతాలైన గమళ్లపాళెం, మాయబజార్ ప్రాంతాలలో ఏర్పాటు చేసే పైపులకు, నీటి ఎద్దడి అధికంగా వుండే బజారువీధి, రాజావీధి, తూర్పువీధి తదితర ప్రాంతాలలో ఏర్పాటు చేసే పైపులకు ఎంతో వ్యత్యాసం వుంటోంది. పైపులు నాణ్యమైనవిగా వుండడం లేదు. పైపులు వేసేటప్పుడు అడుగు భాగాన ఇసుక బెడ్ వేసి పనులు చేయాల్సి వుండగా అలాంటి వేమీ లేకుండా తూతూ మంత్రంగా పనులు కానిచ్చేస్తున్నారు. దీని వలన ఏర్పాటు చేసిన కొద్దికాలానికే పైపులు కుంగిపోవడం, పగిలిపోవడం జరుగుతుందని ప్రజలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. మరోవైపు పైపులైన్ల ఏర్పాటు పేరుతో కోట్లాది రూపాయలు ఖర్చుపెట్టి నిర్మించిన సిమెంట్ రోడ్లను ఎక్కడికక్కడ ధ్వంసం చేస్తుండడం, వాటిని సక్రమంగా పూడ్చకపోతుండడంతో రోడ్లన్ని రూపురేఖలు కోల్పోయి ప్రజలపాలిట ప్రమాదకరంగా పరిణమిస్తున్నాయి.

## ప్రణాళికబద్ధ సేద్యంతో అధిక దిగుబడులు

**నెల్లూరు రైతు శిక్షణా కేంద్రం సహాయ సంచాలకుడు**

రైతులు ప్రణాళికాబద్ధంగా సేద్యం చేస్తే అధిక దిగుబడులు సాధించవచ్చని నెల్లూరు రైతు శిక్షణ కేంద్రం సహాయ సంచాకులు వెంకటేశ్వర్లు సూచిస్తున్నారు. వెంకటగిరి మండల పరిధిలోని పారవోలు గ్రామంలో ఇటీవల సమగ్రపోషణ యాజమాన్యంపై శిక్షణ తరగతులు నిర్వహించారు. ఈ కార్యక్రమానికి హాజరైన ఆయన రైతులకు పలు సూచనలు, సలహాలు అందించారు. విత్తడానికి ముందు విత్తనాలను కీటక నాశన మందులతో శుద్ధి చేసి వేస్తే పంటలను కాపాడుకోగలమన్నారు. క్రిమికీటకాలను ఎప్పటికప్పుడు గమనించి నిర్దేశించిన మందులను తగిన మోతాదులో పిచికారి చేయాలన్నారు. రైతుల సేంద్రీయ వ్యవసాయంపై ప్రత్యేక దృష్టి సారించాలన్నారు. రైతులకోసం ప్రభుత్వం ఏర్పాటు చేసిన ధాన్యం కొనుగోలు కేంద్రాలను రైతులు వినియోగించుకోవాలని వెంకటగిరి వ్యవసాయ సంచాలకులు జడ్.వెంకటేశ్వర్లు తెలిపారు. ధాన్యాన్ని తూర్పారబట్టడం వల్ల అందులోని తరకలుపోయి నికరమైన ధాన్యం వుంటుందన్నారు. ఈ కార్యక్రమంలో వ్యవసాయాధికారి గిరీష్, విస్తరణాధికారి రామ్మోహన్ తదితరులు పాల్గొన్నారు.

**• కావలిలో**

## తాగునీరు కలుషితం!

కావలి పట్టణంలోని పలు ప్రాంతాలలో త్రాగునీరు కలుషితం అవుతుండడంతో ప్రజలు ఆస్పత్రిపాలవుతున్నారు. పారిశుధ్య పరిస్థితులు నానాటికి దిగజారుతున్నా పట్టించుకొనే వారే లేకుండా పోయారు. ప్రజాప్రతినిధులు వచ్చినప్పుడు, ఉన్నతాధికారుల రాక సందర్భంగా తూతూమంత్రంగా పనులు చేసి అంతా పరిశుభ్రంగా వుందని చెప్పడం తప్ప వాస్తవానికి చాలా వ్యత్యాసం వుంటోంది. పలు ప్రాంతాలలో ఇళ్ల ముందు మురుగు ప్రవహిస్తోంది. 11వ వార్డు పరిధిలోకి వచ్చే అంబేద్కర్‌నగర్, తుమ్మలపెంట రోడ్డు, కసాయివీధి, దళితవాడల్లో పారిశుధ్యం మరింత క్షీణించి వుంటోంది. 600 కుటుంబాలు ఇక్కడ నివసిస్తున్నాయి. ఈ ప్రాంతంగుండా వైకుంఠపురంలోని అన్నపుగుంట వరకు ప్రవహించే మురికి కాలువలోని నీరు త్రాగునీటి పైపుల్లో చేరుతుండడంతో మంచినీరు కలుషితమైపోతోంది. ఈ నీటిని త్రాగడం వల్ల ప్రజలు అనారోగ్యానికి గురై ఆస్పత్రి పాలవుతున్నారు. అధికారులు పైపులైన్ లీకేజిలను అరికట్ట లేకపోవడం, పారిశుధ్యాన్ని మెరుగు పరచకపోతుండడంతో ప్రజలకు కష్టాలు తప్పడం లేదు. మరోవైపు ఈ ప్రాంతంలో మునిసిపాలిటీ నిర్మించిన మరుగుదొడ్లు నిరుపయోగంగా మారాయి. ఇప్పటికైనా మునిసిపల్ అధికారులు ఈ ప్రాంతంపై దృష్టి సారించి పారిశుధ్యాన్ని మెరుగు పరచాలని, నీరు కలుషితం కాకుండా చూడాలని పలువురు కోరుకొంటున్నారు.

**ఆస్పత్రుల పాలవుతున్న ప్రజలు**




**కవిత్రయ జయంత్యుత్సవాల్లో భాగంగా నెల్లూరు టౌన్‌హాల్‌లో జరిగిన ఎర్రన జయంతి సభలో వక్త డాక్టర్ రామడుగు వెంకటేశ్వర శర్మను సన్మానిస్తున్న దుగ్గిశెట్టి రమణయ్య, పి.వి.రమణారెడ్డి, అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, బివి.నరసింహం.**

# అధిష్ఠానం ఆదేశిస్తే పోటీకి రెడీ!

**● ఉదయగిరిలో కంభం ప్రకటన**

కాంగ్రెస్ అధిష్ఠానం ఆదేశిస్తే ఉదయగిరికి జరిగే ఉపఎన్నికలలో పోటీ చేయడానికి సిద్ధం అని మాజీ శాసనసభ్యుడు కంభం విజయరామిరెడ్డి ప్రకటించారు. స్థానికంగా జరిగిన కార్యక్రమంలో పాల్గొనేందుకు వచ్చిన ఆయన మాట్లాడుతూ అధిష్టానం ఆదేశాలు తనకు శిరోధార్యం అన్నారు. అభ్యర్థి ఎవరైనా సరే వారి విజయానికి కలసికట్టుగా కృషి చేస్తామన్నారు. మేకపాటి సోదరులు ఊసరవెల్లుల్లా రంగులు మారుస్తూ ప్రజలను తప్పుదోవ పట్టిస్తున్నారని విమర్శించారు. నెల్లూరు పార్లమెంటుకు, ఉదయగిరి శాసనసభకు జరిగే ఎన్నికలలో మేకపాటి సోదరులను గెలిపిస్తే రౌడీలకు లైసెన్సు ఇచ్చినట్లవుతుందని తీవ్రంగా విమర్శించారు. ఆనం సోదరుల ఆధ్వర్యంలో కాంగ్రెస్ పార్టీని బలోపేతం చేసేందుకు తనవంతు కృషి చేస్తానన్నారు.

# తాగుబోతు ఆర్ఐ!

**● మర్రిపాడులో జనం ఇక్కట్లు**

ప్రజల సమస్యలు పరిష్కరించాల్సిన రెవెన్యూ ఇన్స్‌పెక్టర్ డాబాలో పూటుగా మద్యం సేవిస్తూ ప్రశ్నించిన వారిపై చిందులు తొక్కిన వ్యవహారం మర్రిపాడులో జరిగింది. స్థానిక రెవెన్యూ ఇన్స్‌పెక్టర్ ప్రభాకర్ తహశీల్దార్ కార్యాలయంలో జరిగే గ్రీవెన్స్ డేకు హాజరు కాకుండా డాబాకు వెళ్లి మద్యం తాగుతూ వున్నాడు. వివిధ పనులపై వచ్చిన మండల ప్రజలు ఎంతోసేపు అతని కోసం ఎదురు చూసినా కార్యాలయానికి రాకుండా పోవడం, అధికారులకు ఎలాంటి సమాచారం ఇవ్వకపోవడంతో వెనుదిరిగిన వారికి ఆర్ఐ మద్యం సేవిస్తున్న విషయం తెలిసి డాబా వద్దకు చేరుకొనడంతో గందరగోళం నెలకొంది. ఆ ప్రబుద్ధుడు ఎవరొస్తే నాకేం అన్నట్లు తన పనిలో తాను వుండి నిషాలో మునిగిపోయాడు. ఈ విషయాన్ని ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యంరెడ్డి దృష్టికి తీసుకొనిపోయి, చాలాకాలంగా సమస్యలు పరిష్కారం కాకుండా పోతున్నాయని ఫిర్యాదు చేశారు. ఈ మండలంలో ఇటీవల జరిగిన 50ఎకరాల భూకబ్జా వ్యవహారం సంచలనం రేకెత్తించింది. దీనిపై ఎలాంటి ఇబ్బందులు రాకుండా వుండేందుకు కబ్జాదారులు ఆర్ఐను తమ గుప్పెట్లో వుంచుకొని ఆడిస్తున్నారనే ఆరోపణలు వినవస్తున్నాయి.

కలువాయి కేంద్రంగా ఎర్రచందనం స్మగ్లింగ్‌లో ఆరితేరి డాన్‌గా పేరు గడించిన మేకపాటి సుబ్బారెడ్డి కోర్టులో లొంగిపోయాడు. స్మగ్లింగ్‌లో తనకు కుడి భుజమైన నీరుకట్ల హరితో కలసి ఆయన మార్చి 27న ఆత్మకూరు ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్ కోర్టులో లొంగిపోయాడు. తెలుగురాయపురం గ్రామం వద్ద పట్టుబడిన రెండులారీల ఎర్రచందనం, కలువాయి సుసర్లవీధిలో టాటా మ్యాజిక్ వాహనంలో పట్టుబడిన కేసుల్లో వీరివురు నిందితులుగా వున్నారు.

# స్మగ్లింగ్ డాన్ లొంగిపోయాడు!

**ఆశ్చర్యపోయిన ఎర్రచందనం స్మగ్లర్లు**

గత రెండు నెలలుగా తప్పించుకొని తిరుగుతూ బెయిల్ కోసం విశ్వప్రయత్నం చేశారు. బెయిల్ దొరక్కపోవడంతో చివరకు మేజిస్ట్రేట్ ముందు లొంగిపోయారు. కోర్టు వీరికి ఏప్రెల్ 10వరకు డిమాండ్ విధించింది. గతంలో దామోదర్ ఎస్పీగా వున్న సమయంలో సుబ్బారెడ్డి స్మగ్లింగ్ చేస్తూ పట్టుబడి రెండు రోజులు నెల్లూరు పోలీసుల కస్టడీలో వుండి తన రాజకీయ పలుకుబడి, పాతిక లక్షల వరకు డబ్బులు ఖర్చు పెట్టి ఎలాంటి కేసులు రాకుండా బయటపడ్డాడు. అలాంటి వ్యక్తి వున్నట్లుండి కోర్టులో లొంగిపోవడంపై తీవ్ర చర్చ జరుగుతోంది.

# అంకిత భావంతో పని చేయండి!

బెటాలియన్‌లోని సిబ్బంది అంకిత భావంతో పని చేస్తే తగిన గుర్తింపు వస్తుందని 9వ బెటాలియన్ కమాండెంట్ నాగూర్‌రెడ్డి తెలిపారు. వల్లివేడు క్యాంప్‌లో జరిగిన కార్య క్రమంలో పాల్గొన్న ఆయన మాట్లాడుతూ విధి నిర్వహణ సక్రమంగా చేస్తే పదోన్నతులు, ప్రశంసలు వాటంతట అవే వస్తాయన్నారు.

**వల్లివేడు పోలీసు బెటాలియన్ కమాండెంట్ సూచన**

రాష్ట్రంలో 11,12,13 బెటాలియన్ల నుంచి పదోన్నతిపై వచ్చిన బలదేవ శివార్, వెంకటనారాయణరెడ్డి, దామోదర్‌రెడ్డి, గోవిందరాజు ఆర్ఎస్ఐలుగా వచ్చారని పరిచయం చేసి వారికి నియామక పత్రాలు అందజేశారు.

## చైనా ప్రపంచ ఆర్థిక శక్తిగా ఎదగను

# భారతదేశమే అడ్డు... అందుకే ఈ అక్కసు!

### భారత సైన్యం నిజంగానే

16వ పేజీ కొరవ

నెహ్రూ హిందీ చినీ భాయి భాయి అన్నాడు. కానీ దెబ్బకు మాత్రమే దయ్యం జడుస్తుందనే సిద్ధాంతంతో చైనా నేతలు భారతదేశంతో పాటు రష్యా, కొరియా, వియత్నాం, కంబోడియా తదితర చోటలంతా సైనిక బల ప్రదర్శనే చేశారు. ఇప్పుడు ఈ రెండు దేశాల మధ్య ఆర్థిక ప్రగతి పోటీ వుంది. ప్రపంచంలో అత్యున్నత ఆర్థిక శక్తిగా ఎదగడానికి చైనా శ్రమిస్తున్నది. అందుకు భారత దేశం ఒక అడ్డంకి అన్నది వారి అనుమానం. సరిసమానమైన జనాభా, మానవ నైపుణ్యం కల్గిన భారతదేశాన్ని అణిచి పెడితే తప్ప, ప్రపంచ ఆర్థిక ఆధిపత్యం కోసం తాను చేసే కృషిలో ముందుకు కదలడం సాధ్యం కాదన్నది చైనా సిద్ధాంతం. దానికోసమే భారతదేశంతో గిల్లి కజ్జాలకు సిద్ధమౌతున్నారు వారు.

1962 నాటి యుద్ధంలో చైనా ముందు తల దించుకోవాల్సి వచ్చింది మనం. చైనా భూభాగానికి, టిబెట్‌ను కలిపే అక్సాయి చిన్ అనే మంచుకొండల ప్రాంతం భారతదేశంలో ఒక భాగం. కాశ్మీర్ ప్రాంతంలో వుంది అది. అది తమ స్వాధీనంలోకి వస్తే తప్ప టిబెట్ మీద తన గుత్తాధిపత్యం నిలవదని గ్రహించిన చైనా భారతదేశాన్ని యుద్ధంలో ఓడించి మరీ దాన్ని స్వాధీనం చేసుకొన్నది. దానితో పాటుగా అరుణాచల్‌ప్రదేశ్‌ను సైతం తనకు వదలి వేయమని అప్పటి నుంచి ఒత్తిడి చేస్తూనే వుంది. దానితో రెండు దేశాల మధ్య శాశ్వతంగా సరిహద్దు వివాదం నడుస్తున్నది.

### పెట్రోల్ సంపదకు పోటీ

ఈ సరిహద్దు వివాదానికి తోడు, ఇప్పుడు తాజాగా రెండు దేశాల మధ్య పెట్రోల్ సంపద పోటీ ఏర్పడింది. వియత్నాం, కంబోడియా సముద్ర జలాలలో పెట్రోల్ అన్వేషణకు ఆ రెండు దేశాల నుంచి హక్కు పొందింది భారతదేశం. అయితే అవి తమ తీరప్రాంత జలాలని, అక్కడ పెట్రోల్ బావులు త్రవ్వితే సహించమని హెచ్చరిస్తున్నారు చైనీయులు. బెదరింపుగా భారీ యుద్ధనౌకలను మొహరిస్తున్నారు.

### యుద్ధం వస్తే వినాశమే

ఇప్పటికిప్పుడు చైనాతో యుద్ధం వస్తే భారతదేశం ఎదురొడ్డి నిలవడం చాలా కష్టం. ఏ రూపంలో చూసినా వారి శక్తి ముందు మనం బలహీనులం అన్న మాట ఒప్పుకొని తీరాల్సిన నిజం. ఏ అమెరికా సహాయమో తీసుకొంటే తప్ప యుద్ధ రంగంలో నిలవడం కష్టం. అటువంటి విదేశీ సహాయాలు దేశ వినాశనానికి తప్ప మంచికి పనికి రావు. చైనాతో సయోధ్య మాత్రమే భారత దేశానికి మిగిలి వున్న ఏకైక మార్గం. అందుకు వారు సహకరించినా, సహకరించికపోయినా నష్టపోయేది మనం మాత్రమే. నిష్ఠూరంగా కన్పించినా వాస్తవం అదే.

### మన సైన్యం మీద ఎంతో భారం

భారతదేశానికి నాలుగు వైపులా కలిసి 15600 కిలోమీటర్ల మేర భూభాగం సరిహద్దులున్నాయి. పాకిస్తాన్, చైనా, నేపాల్, బర్మా, భూటాన్, బంగ్లాదేశ్ వంటి దేశాలన్నిటితో సరిహద్దు వుంది మనకు. దాదాపు 7500 కిలోమీటర్ల సముద్ర తీరం దీనికి అదనం. ఇంత విస్తారమైన సరిహద్దులకు రక్షణ కల్పించడం మాటలు చెప్పినంత సులభమేమీ కాదు. సైన్యం ప్రధాన విధి అదే. కానీ దురదృష్టవశాత్తు మన సైన్యం మీద దేశ సరిహద్దుల రక్షణతో పాటుగా, అంతర్గత భద్రత బాధ్యత కూడా మోపుతున్నారు. కాశ్మీర్‌తో పాటుగా నాగాలాండ్, అస్సాం, మణిపూర్ వంటి ఈశాన్య రాష్ట్రాలన్నీ గత యాభై ఏళ్లుగా తీవ్రవాద సమస్యతో సతమతమౌతున్నాయి. ఆ సమస్యను పరిష్కరించడం స్థానిక పోలీసు యంత్రాంగానికి సాధ్యం కాకపోవడంతో సైన్యాన్ని వాడుతున్నారు. మరొకప్రక్క దేశ భూభాగంలో 40 శాతం మేర నక్సలైట్ల ప్రాభవం స్థిరపడిపోయి వుంది. దీన్ని నివారించడానికి కూడా ఇప్పుడు సైన్యాన్నే రంగంలోకి దించుతున్నారు. ఇవి కాక దేశంలో అప్పుడప్పుడు చెలరేగే ఆందోళనల అణిచివేతకు కూడా సైన్యమే దిక్కు అవుతున్నది. వీటన్నిటి వల్ల మన మొత్తం సైన్యంలో నాలుగో వంతు భాగం సరిహద్దులను, శత్రువులను వదలి పెట్టి స్వదేశంలో, స్వంత ప్రజలతో యుద్ధం చేయక తప్పడం లేదు. దీని వల్ల సైనిక శక్తిని పూర్తి స్థాయిలో దేశ రక్షణకు వినియోగించడం వీలు కావడం లేదు. ఎన్నికలొచ్చినా సైన్యమే దిక్కు కావడం మరే దేశంలోనూ చూడలేము.

### అవినీతి ప్రధాన అడ్డంకి

సైనిక శక్తిని పెంచడంలో, పదిలం చేయడంలో ప్రభుత్వ లోపం లేదు. ఎవరు ప్రధానిగా, రక్షణ మంత్రిగా వున్న దానికి అత్యధిక ప్రాధాన్యత ఇస్తూనే వున్నారు. అయితే అసలు సమస్యంతా, పౌర పాలనలోని అవినీతి. మన సైన్యానికి కావలసిన వస్తు సామాగ్రిలో నూటికి తొంభై పాళ్లు విదేశాల నుంచి దిగుమతి చేసుకోవాల్సినవే వుంటాయి. నౌకలు, విమానాలు, ట్యాంకులు, శతఘ్నులు, క్షిపణులు, సాంకేతిక పరికరాలు, రాడార్లు, సమాచార వ్యవస్థ సమస్తం విదేశాల నుంచే రావాలి. లక్షలాది కోట్ల రూపాయల ఖర్చుతో కూడిన ప్రక్రియ అది. దానితో ఆ వ్యాపారాన్ని దక్కించుకోవడానికి ఆయుధ వ్యాపారులు మన ప్రభుత్వ, సైనికాధికారులకు లంచాల ఎర వేయడం సాధారణమై పోయింది. ఆ అవినీతి దేశ రక్షణకు పెద్ద అవరోధంగా మారుతున్నది.

మన సైన్యాధిపతి వికె.సింగ్ చెప్పింది కూడా అదే. ఆయుధాల సేకరణలో అవినీతి, మితిమీరిన జాప్యం కలగలసి సైన్యం శక్తిని హరించి వేస్తున్నాయని ఆరోపించారాయన. ఆయన మాటలో కొంత నిజం వుంది.

(కొరవ పై వారం)






వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ గౌరవాధ్యక్షురాలు వైఎస్.విజయమ్మను హైదరాబాద్‌లో కలిసి పుష్పగుచ్ఛాన్ని అందజేస్తున్న కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి, ఆయన సతీమణి గీతమ్మ.



పెంచిన ఇంటి పన్నులను తగ్గించాలని నెల్లూరు కార్పొరేషన్ కార్యాలయం వద్ద సిపిఎం చేస్తున్న ధర్నాలో మాట్లాడుతున్న మాజీ ఉపమేయర్ మాదాల వెంకటేశ్వర్లు, ప్రక్కన రమమ్మ తదితరులు.



జిల్లా గ్రంథాలయ సంస్థ మాజీ ఛైర్మన్ నాగారెడ్డి హరిశ్చంద్రారెడ్డి మనుమడు వెంకట సుబ్రహ్మణ్యకుమార్, మంజుభార్గవిల వివాహం మార్చి 9తేది సూళ్లూరుపేట టివిఆర్ కళ్యాణ మండపంలో జరిగింది.

# ఏసుప్రభువును శిలువ వేసిన రోజే గుడ్‌ఫ్రైడే!




క్రైస్తవ మతస్తులకు ముఖ్యమైన రోజుల్లో గుడ్‌ఫ్రైడే ఒకటి. పాపుల్ని ద్వేషించకు, పాపాల్ని ద్వేషించు అన్న ప్రేమమూర్తి ఏసుక్రీస్తును శిలువ వేసిన రోజు ఇది. దీనినే గాడ్స్‌ఫ్రైడే, హోలీఫ్రైడే, బ్లాక్‌ఫ్రైడే, గ్రేట్ ఫ్రైడే అని కూడా పిలుస్తారు. తమ జీవిత నావను నడిపించే దైవకుమారుడైన ఏసు ప్రభువు రక్తధారల మధ్య, ముళ్లకిరీటంతో శిలువ వేయబడ్డాడని క్రైస్తవులంతా దు:ఖసాగరంలో మునిగిపోయేరోజు. క్రీస్తుకు శిలువ వేయడం, కల్వరి వద్ద ఆయన మరణం యొక్క జ్ఞాపకాలను ఆనాడు నెమరు వేసుకొంటారు. చర్చిల్లో ప్రత్యేక ప్రార్ధనలు జరిపి, ఉపవాస దీక్షలు పాటిస్తారు.

ఏసుక్రీస్తు నజరత్ పట్టణానికి చెందిన వ్యక్తిగా చెప్తారు. ప్రస్తుతం ఆ పట్టణం ఇజ్రాయిల్ దేశంలో వుంది. చాలామంది ఏసును దేవునిబిడ్డగా భావించేవారు, పూజించేవారు. ఇది యూదుప్రవక్తలకు, ఉన్నతాధికారులకు కంటగింపుగా వుండేది. ప్రజల్ని ఏసుక్రీస్తు తప్పుదోవ పట్టిస్తున్నాడని భావించేవారు. ఆయనకు ప్రజల్లో వున్న ఆరాధన భావాన్ని చూసి తట్టుకోలేక ఎలాగైనా హతమార్చాలని కుట్రచేస్తారు. దానిలో భాగంగా జుడాలని పిలువబడే 12మందితో శిష్యబృందాన్ని ఏర్పాటు చేసి ఈ పథకాన్ని అమలుపరచాలని పథకం రచిస్తారు. ఒకనాడు వారు ఏసుప్రభువును నిర్భందించి మరునాడు ప్రధాన యాజకుల సంఘం ముందు హాజరుపరుస్తారు. ప్రజలను ప్రక్కదోవ పట్టిస్తున్నాడని, చక్రవర్తికి పన్నులు కట్టవద్దని చెప్తున్నాడని, దేవుని ప్రతినిధిగా చెప్పుకొంటున్నాడని పలు ఆరోపణలు చేస్తారు. ఇవన్ని నిజమేనని నిర్ధారించి రోమ్ చక్రవర్తి ఎదుట ఏసుక్రీస్తును హాజరుపరుస్తారు. అయితే చక్రవర్తి ఆ ఆరోపణల్ని నమ్మకపోవడంతో ప్రధాన యాజకులు పట్టుబట్టి, ఒత్తిడితెచ్చి విధ్వంస కాండకు ఏసు కారణమని చెప్తారు. చేసేదిలేక ఆయన మీఇష్టం వచ్చిన శిక్ష వేసుకోండని చెప్పి నిర్ణయాన్ని ప్రధాన యాజకులకు వదిలేస్తాడు. దీంతో వారు ఏసుప్రభువుకు శిలువ వేయాలని నిర్ధారించి దానిని అమలు చేస్తారు. జీసస్ తలపై ముళ్ల కిరీటం పెట్టి చెక్కతో చేసిన పెద్ద శిలువను ఆయన భుజాలపై మోపుతారు. సైనికులు కొరడాలతో కొడుతూ నడిపించుకవెళ్లి కల్వరి కొండపై అరచేతుల్లో మేకులు దించి శిలువ వేస్తారు. రక్తం ఓడుతున్న ఏసుక్రీస్తు మధ్యాహ్నం మూడుగంటలకు తుదిశ్వాస వదలుతారు. ఆ సమయంలో ఏసుప్రభువు నా మరణానికి కారణమైన ఈ పాపులను క్షమించు అని దేవుడిని ప్రార్ధిస్తారు. ఇది ఆయనలోని క్షమాగుణానికి, దయకు, ఔన్నత్యాలకు నిదర్శనం. ఆ తర్వాత మూడోరోజైన ఆదివారం నాడు తిరిగి ఏసు క్రీస్తు పునర్జన్మిస్తారు. జీసస్ మరణం, తిరిగి జన్మించడానికి గుర్తుగా ఆరోజున చర్చిలో ప్రత్యేక ప్రార్ధనలు చేస్తారు. క్రీస్తు బోధనలు, ఆయన పలికిన ఏడు అమరవాకాలను స్మరించుకొంటారు.

## ట్రంకు రోడ్డు

### పూజాపునస్కారాల కలెక్టర్





జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి పలు అంశాల్లో విలక్షణంగా కనపడుతూ చర్చనీయాంశమవుతుంటారు. ఆయన అప్పుడప్పుడు మినహా టక్‌చేసి కనపడడు. నుదిటిపై ఒకరోజు విబూది బొట్టుంటే మరో రోజు కుంకుమ బొట్టుంటుంది. బంగళా నుంచి బయటకు వచ్చే ముందు ఆయన పూజాపునస్కారాలు పూర్తి చేస్తారు. క్యాంప్ ఆఫీసులోని అన్ని దేవతా విగ్రహాలు, పటాలను పూలతో అలంకరిస్తారు. కలెక్టర్‌గారు ఏ రోజుకారోజు పాల్గొనే ప్రధమ కార్యక్రమంలో పరిశీలించి చూస్తే ఆయన నెత్తిపై అక్షింతలు కూడా ఉంటాయి. భక్తిశ్రద్ధల కలెక్టర్‌గా శ్రీధర్‌రెడ్డిని చెప్పుకోవచ్చు.

### దిగిన కోడి!




ధరలు పెరగడమేకానీ తగ్గని రోజులివి. అటువంటి పరిస్థితుల్లో ఈ మధ్య కిలో 176 రూపాయల వరకు అమ్మిన స్కిన్‌లెస్ కోడి మాంసం పది రోజుల వ్యత్యాసంలోనే 134 రూపాయలకు తగ్గింది. కోడి మాంసం ఆల్‌టైం రికార్డు ధర 187 రూపాయలను ఈ ఏడాది అధిగమిస్తుందని చికెన్ వ్యాపారుల అంచనా తలక్రిందులవ్వడం విశేషం.

### అతను వద్దు!



నెల్లూరు పార్లమెంటు నియోజకవర్గానికి త్వరలో ఉపఎన్నికలు జరుగనున్నాయి. ఇక్కడ తెలుగుదేశం అభ్యర్థిగా వంటేరు వేణుగోపాల్‌రెడ్డి, వైకాపా అభ్యర్థిగా మాజీ ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డిల పేర్లు దరిదాపులు ఖరారయ్యాయి. కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేయను చాలామంది పేర్లను ముందు చెప్పిన నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి చివరకు తాను ఎమ్పీగా పోటీచేస్తానని, ఆశీర్వదించమని కంచి కామకోటి పీఠాధిపతి కాళ్లకు మొక్కి తన మనసులో కోరిక బయటపెట్టాడు. వివేకానందరెడ్డి బయటపడడంతో ఆయన్ను కాదని తమకు టిక్కెట్ ఇవ్వమని అడిగే ఆశావహులు కాంగ్రెస్‌లో కన్పడడం లేదు. కానీ పార్లమెంటు నియోజకవర్గ పరిధిలోని కాంగ్రెస్ కార్యకర్తలు మాత్రమే వివేకా పోటీచేస్తాననడాన్ని జీర్ణించుకోలేక పోతున్నారు. ఆయన వేషాలు, ఒట్టిమాటలతో సరిపెడతాడని; గట్టిపోటీ సమయంలో ఆయన అభ్యర్థిత్వం ఎందుకన్న చర్చ ట్రంకురోడ్డులో విస్తృతంగా జరుగుతుంది.

### ఆల్‌టైం హైకి కూరగాయలు





ఎండలు ముదరకముందే ఆల్‌టైం హై ధరలకు కాయగూరలు చేరుకోవడంతో జనం అల్లాడిపోతున్నారు. వంకాయలు, బెండకాయలు, కాకరకాయలు, బీరకాయలు, దోసకాయలు, పందిరి చిక్కుళ్లు, గోరుచిక్కుళ్లు, క్యారట్, బీన్స్ అనే తేడా లేకుండా ఏదైనా కిలో ముప్పై రూపాయల పైమాటే. ఇంత రేటు పలుకుతున్నా నెల్లూరు ఎసి మార్కెట్‌లో పుచ్చు, చెడిపోయిన కూరగాయలు వినియోగదారుడు తక్కెట్లో చేయిపెట్టి ప్రక్కకు తీసివేసే అవకాశమే లేదు. వ్యాపారస్తులు ఇచ్చిందే మంచి సరకు, తూచిందే నిఖార్సు తూకమని సర్దుకు పోవాల్సి రావడంతో జనం లోలోన కూరగాయల కన్నా ముందు ఉడికిపోతున్నారు. వీరు చల్లబడే రోజెన్నడో?

### పోలింగ్ కేంద్రాలవారీ ఓట్ల పరిశీలన!




ఎన్నికల్లో పోటీచేసే అభ్యర్థులకు గెలుపు ప్రతిష్టాత్మకమైపోయింది. నియోజకవర్గాలు, మండలాలు, మేజర్ పంచాయితీల్లో గత పార్లమెంటు, అసెంబ్లీ ఎన్నికలలో పొందిన ఓట్ల గూర్చి ఆలోచించడం లేదు. పోలింగ్ కేంద్రాలవారీగా గతంలో వివిధ పార్టీలు పొందిన ఓట్లను పరిశీలించే పనిలో తెలుగుదేశం పార్టీ బిజీగా ఉంది. క్షేత్రస్థాయిలో పొందిన ఈ ఓట్ల ఆధారంగా శాస్త్రీయంగా అడుగులు వేయాలని ప్రయత్నిస్తుంది. దీన్ని కాంగ్రెస్, వైకాపాలు ఏవిధంగా తీసుకొంటాయో వేచి చూడాలి మరి!


**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

అన్ని కార్యక్రమాలు అనుకూలించి ఆర్థికంగా బాగుంటుంది. దూర ప్రాంతాల నుండి శుభవార్తలు వింటారు. అయితే కొన్ని విషయాలలో అవమానాలు ఎదురౌతాయి. విద్యార్థులకు అనుకూలమైన వారం. పరీక్షలలో ఉత్తీర్ణత సాధించగలరు. వ్యవసాయదారులు క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొంటారు. దీర్ఘకాలిక సమస్యల పరిష్కారం కొంత పూరటనిస్తుంది. వ్యాపారస్తులకు అనుకూలం.


**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

తలపెట్టిన పనులు సకాలంలో పూర్తిచేస్తారు. గృహనిర్మాణ పనులు పురోగతి సాధిస్తాయి. ఇంట్లో చేసే శుభకార్య ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యార్థులు తమ తెలివితేటలకు తగిన ఫలితాలను సాధిస్తారు. వ్యవసాయ రంగంలోనివారు ఆర్థిక విషయాలలో పుంజుకొంటారు. పరిష్కారం కాని వివాదాలు మీ సన్నిహితుల సహకారంతో పూర్తిచేస్తారు. బంధుమిత్రులతో భేదాభిప్రాయాలు రాకుండా చూసుకొనేది.


**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

గతంలో ఏర్పడిన సమస్యల నుండి విముక్తి పొందగలరు. తలపెట్టిన పనులు శ్రమతో పూర్తి చేస్తారు. భూ వివాదాలు పరిష్కారం కాబడి, మానసిక ఆనందం పొందుతారు. ఉద్యోగ, వ్యాపార, కళా, క్రీడా రంగాలలోని వారికి చిక్కులు, చికాకులు తొలగి ఉత్సాహంగా ముందుకు సాగగలరు. వ్యవసాయం చేసేవారికి ఆర్థిక నిలకడ వుంటుంది. రాజకీయ రంగంలోని వారికి అనుకోని అవకాశాలు వస్తాయి.


**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

ఈ రాశి వారికి శుభాశుభ మిశ్రమంగా ఫలితాలుంటాయి. ఆస్తి వివాదాలలో పరిష్కారం లభిస్తుంది. చెడు నడత కలిగిన వారికి దూరంగా వుండటం శ్రేయస్కరం. కుటుంబ సభ్యుల మధ్య భేదాభిప్రాయాలుంటాయి. ఇంటాబయట ఖర్చులధికంగా వుంటాయి. మానసిక ఒత్తిడిచే శరీరారోగ్య లోపం వుంటుంది. వ్యవసాయ రంగంలోని వారికి గతంలోకంటే మేలనిపిస్తుంది.


**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

చేసే పనులు ఆలస్యమవడం వల్ల ఆర్థికంగా కొంత ఇబ్బంది కలిగినా అవసరాలకు ధనం అందుతుంది. గృహనిర్మాణాది కార్యక్రమాలు పూర్తికాబడి మనస్సుకు సంతృప్తినిస్తుంది. వ్యవసాయ రంగంలోని వారు అనవసర ఆందోళనకు గురౌతారు. రాజకీయ రంగంలోని వారికి అనుకూల సమయం. పై వర్గాల వారి సహకారంతో లాభం పొందగలరు. ఒక విషయం వీరిని మనస్తాపానికి గురిచేస్తుంది.


**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

చేసే పనులలో, ఇంటా బయట చిక్కులు, చికాకులేర్పడి ఆందోళన పడతారు. చేసే కార్యక్రమాలు శ్రమతో పూర్తి చేస్తారు. విద్యార్థులు బాగా కష్టపడవలసి వుంటుంది. వ్యవసాయ రంగంలోని వారికి ఆర్థికంగా సామాన్యంగా వుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి పనులలో ఆటంకాలెదురౌతాయి. రాజకీయ రంగంలోని వారికి ఉత్సాహం తగ్గి, ఆందోళనకు గురౌతారు.

# వారఫలాలు

*తేది 7-04-2012 నుండి 13-04-2012 వరకు మేషంలో గురువు; వృషభంలో శుక్ర కేతువులు; సింహంలో కుజుడు; తులలో శని; వృశ్చికంలో రాహువు; మీనంలో రవి, బుధులు; కన్య, తుల, వృశ్చిక, ధనుస్సులలో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

9తేది సంకష్టహర చతుర్ధి.

### శుభ ముహూర్తాలు

7, 8, 9, 10, 11, 13తేదీలలో వివాహ, అక్షరాభ్యస, అన్నప్రాసన, డోలారోహణ, కేశఖండన, గృహప్రవేశ, ఉపనయన, క్రయవిక్రయాది శుభకార్యాలకు సుముహూర్తాలున్నాయి.

### ఏప్రెల్ తిథులు
### చైత్ర బహుళ

| | | | | |
|---|---|---|---|---|
| 7 | శని | పాడ్యమి | రా 09.06 | గం.ల.వ |
| 8 | ఆది | విదియ | సా 05.28 | గం.ల.వ |
| 9 | సోమ | తదియ | ప 02.02 | గం.ల.వ |
| 10 | మంగళ | చవితి | ప 10.57 | గం.ల.వ |
| 11 | బుధ | పంచమి | ప 08.19 | గం.ల.వ |
| 12 | గురు | షష్ఠి | ఉ 06.15 | గం.ల.వ |
| 13 | శుక్ర | సప్తమి | తె 03.58 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, డిఎస్ఆర్ నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.


**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

ఈ రాశి వారికి ఈ వారం అనుకూలం. ఆర్థిక లావాదేవీలలో క్లిష్టత కనిపిస్తుంది. ఆర్థిక వ్యవహారాలలో ఇతరులకు హామీలు ఇవ్వవద్దు. వ్యవసాయ, వ్యాపార రంగాలలోని వారికి ఆర్థికంగా బాగుంటుంది. ఉద్యోగస్తులు పై అధికారులతో జాగ్రత్తగా వ్యవహరించవలెను. విద్యార్థులకు బాగుంటుంది. రాజకీయ రంగంలోని వారికి పై వర్గాల నుంచి ప్రశంసలందుతాయి.


**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

తలపెట్టిన పనులందు ఆచితూచి వ్యవహరించాలి. స్థానచలనాలు లేదా దూరప్రయాణాలు వుంటాయి. అనవసర ఖర్చుల వల్ల ధన వ్యయం. ఇతరులచే మాటపడవలసి వస్తుంది. బంధుమిత్రు లతో అకారణ కలహాలు. విద్యార్థులకు కొత్త విషయాలపై ఆసక్తి పెరుగుతుంది. పరీక్షలలో ఉత్తీర్ణత సాధిస్తారు. కళా, క్రీడా రంగాలలోని వారికి కొంతలో కొంత మేలనిపిస్తుంది.


**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

ఈ రాశి వారికి చేసే పనులన్నీ సానుకూలమౌతాయి. శుభకార్యయత్నాలు ఫలిస్తాయి. ఒక శుభవార్త మీ కుటుంబ సభ్యులను సంతోషపరుస్తుంది. ఆర్థికపరమైన ఇబ్బందులు తొలగి అవసరాలకు డబ్బు అందుతుంది. ఉద్యోగ, వ్యాపారస్తులకు అనుకూలించే సమయం. విద్యార్థులకు బాగుంటుంది. వ్యవసాయ రంగంలోని వారికి కొత్త పంటలపై ఆసక్తి పెరుగుతుంది.


**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

శుభాశుభమిశ్రమంగా వుంటుంది. విందులు, వినోదాలలో పాల్గొంటారు. క్లిష్టమైన పనులను వ్యూహాత్మకమైన వైఖరితో పూర్తి చేస్తారు. విద్యార్థులకు పరీక్ష సమయం. వ్యవసాయ రంగంలోని వారికి చిక్కులు, చికాకులు తొలగుతాయి. సాంకేతిక, కళా, క్రీడా రంగాలలోని వారికి అనుకూలం. రాజకీయ రంగంలోని వారికి పనులు నిదానంగా సాగినా విదేశీ లేదా దూరప్రయాణాలు అనుకూలిస్తాయి.


**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

తలపెట్టిన పనులు శ్రమతో పూర్తి చేస్తారు. ఇంట్లో వివాదాలు, గొడవలు రాకుండా జాగ్రత్త పడేది. వృత్తి, వ్యాపార రంగాలలోని వారు ఆర్థికంగా నష్టం కలుగకుండా జాగ్రత్త వహించగలరు. విద్యార్థులకు ఈ వారం క్లిష్ట సమయం. వ్యవసాయ రంగంలోని వారికి గతం కంటే మేలు. కళా, క్రీడా రంగాలలోని వారికి శ్రమాధిక్యం, స్వల్ప అనారోగ్యం, అలసట వుంటుంది.


**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

ఆకస్మిక ప్రయాణాలు, శరీరారోగ్య లోపం వుంటుంది. చేసే పనులలో ఆటంకాలేర్పడుతాయి. బంధుమిత్రులతో వివాదాలు ఆందోళన కలిగిస్తాయి. వ్యవసాయ రంగంలోని వారికి అనుకూలంగా వుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి స్వల్ప ఆటంకాలెదురౌతాయి. ఆదాయం ఖర్చులు సమానంగా వుంటాయి. రాజకీయ రంగంలోని వారికి శుభాశుభమిశ్రమంగా వుంటుంది.

# దేవాలయాల సామాగ్రి ఇంటి నిర్మాణానికి వాడకూడదు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*వై.శేషన్నశాస్త్రి — తిరుపతి*

** పాత శివాలయ'కొయ్యలు' వస్తు సామాగ్రి, మేము వాడవచ్చునా?*

ఆలయ అర్చక, పరిచారికలు ఈ విధమైన సామాగ్రిని వినియోగించి గృహ నిర్మాణం చేయవచ్చని, ఇతరులు అట్లాచేస్తే యజమాని మరణిస్తాడని 'సమరాంగణ సూత్రధారణ' ప్రాచీన గ్రంథం చెబుతోంది.

*వి.అనుపమారెడ్డి — చిత్తూరు*

** నైరుతి పెరిగింది. ఇప్పుడు నిర్మూలించి నిర్మాణం చేయడం సాధ్యం కాదు.*

నైరుతి దోషాలన్నింటికీ 'నరఘోష' యంత్ర ప్రతిష్ట శ్రేష్ఠం. అయినప్పటికీ వీలుంటే నిర్మూలించి సరైన రీతిలో నిర్మించుకోవడం మంచిది.

*డాక్టర్ ఎర్నేని నగేష్ — చెన్నై*

** జ్యోతిషం, వాస్తు ఎవరికివారు పూర్తి ప్రభావాన్ని చూపిస్తాయంటున్నారు.*

అలాంటి శుష్కప్రియపు మాటలు అవాస్తవాలు. రెండూ కలిసి పాతిక, పాతిక. విధి లిఖితం యాభై శాతం ఉంటుంది.

*ఎన్.షర్మిళ — సికింద్రాబాద్*

** వధూవర 'గుణ మేళన' ఖచ్చితంగా పాటించాలా?*

వధూవరుల నక్షత్ర గణనలో ఇదొక పద్ధతి మాత్రమే. లగ్న, రాశి బలాలు బాగుంటే దీన్ని పాటించాల్సిన అవసరం లేదు.

*వి.అరుణ — మదనపల్లె*

** ఎన్ని సంబంధాలు చూసినా కుదరడం లేదు. మాది దిక్కుతోచని పరిస్థితి.*

విచారించకండి. అన్నీ నిర్ణయించబడే ఉంటాయి. మానవ ప్రయత్నం తప్పక చేయాలి. 2012 ఆగష్టు నుంచి సంవత్సర కాలంపాటు అమ్మాయికి అనుకూలమైన కాలం.

*సి.వి.త్రివేణి — కడప*

** అపార్ట్‌మెంటు ప్లాటులో నైరుతి, వాయువ్యాలు పెరిగి ఉన్నాయి.*

ఏ గృహంలో అయినా దిక్కులు పెరగడం కూడదు. ఈశాన్యం ప్రహరీ అంగుళాల్లో పెరగాలి తప్ప గృహ ఈశాన్యం పెరగడాన్ని శాస్త్రం అంగీకరించదు.

*వై.దినకర్ — పెనుగొండ*

** ఉంగరంలో రాళ్లు వేసుకున్నాను. అయినా పరిస్థితులు మారడం లేదు?*

కుడిచేతికి వేరు వేరుగా రెండు రాళ్లు శాస్త్ర ప్రకారం ధరించాలి. నవరత్నధారణ కలసి వస్తుందని జ్యోతిషశాస్త్రం గ్రంథాలేవీ నిర్ధారణ చేయలేదు.

*ఎం.కంభాలరెడ్డి — అద్దంకి*

** దక్షిణ, పశ్చిమ గృహాల్లో వెనుక తూర్పు, ఉత్తర స్థానాల్లో మెట్లు నిర్మించవచ్చా?*

తూర్పు (ఇంద్ర), ఉత్తర (కుబేర) స్థానాల్లో మెట్లు నిర్మాణం కూడదు. బరువులవుతాయి. తాత్కాలికంగా ఇనుప నిచ్చెనలు ఏర్పాటు చేసుకోవచ్చు.

*కె.వి.ఎన్ — ఒంగోలు*

** బాడుగ ఇంట్లో చెడు జరుగుతున్నప్పుడు నివారణ ఎట్లా?*

గృహాన్ని చూపించి దంపతుల నక్షత్ర గణన ప్రకారం వచ్చే 'యంత్రాన్ని' ప్రతిష్టించుకోవడం వల్ల ఫలితం ఉంటుంది.

*జి.అరుణకుమారి — దిగువమాఘం*

** 'దిష్టి' గుమ్మడి కాయను గృహద్వారం వద్ద బలియిచ్చాక, చదివే మంత్రాన్ని చెప్పండి?*

యజమానులు 'కూష్మాండాన్ని' దిష్టితీసి పగులగొట్టిన తర్వాత "ఓం వాస్తు పురుషాయ నమః, ఇద బలిం నివేదయామి" అని మంత్ర పఠనం చేయాలి.(వాస్తు సారము).

*సి.సరోజానాయుడు — చెరువుక్రిందపల్లె*

** పిల్లలు పెడసరి ధోరణి మమ్మల్ని బాధిస్తున్నది. శిక్షించలేము. ఓర్చుకోనూలేము.*

గృహాలు వాస్తుపరంగా ఉంటే ఇంట్లాంటి పరిస్థితులు రావు. వాస్తు సరిచేసుకోవడం, శత్రు గ్రహ బాధలు ఉంటే వాళ్లకి సంబంధిత ఉంగరాలు వేయడమొక్కటే పద్ధతి.

## 2012 కోవూరు నియోజకవర్గ ఉపఎన్నికల ఓట్ల వివరాలు

| బూత్ నెం | పోలింగ్ కేంద్రం | పోలైన ఓట్లు | వైఎస్ఆర్ కాంగ్రెస్ | టిడిపి | కాంగ్రెస్ |
|---|---|---|---|---|---|
| 1 | రెడ్డిపాళెం | 708 | 456 | 200 | 52 |
| 2 | మునులపూడి | 618 | 365 | 205 | 48 |
| 3 | వవ్వేరు | 1045 | 634 | 278 | 133 |
| 4 | వవ్వేరు | 895 | 531 | 231 | 133 |
| 5 | వవ్వేరు | 842 | 438 | 199 | 205 |
| 6 | వవ్వేరు | 388 | 153 | 154 | 81 |
| 7 | వవ్వేరు | 695 | 448 | 104 | 143 |
| 8 | పోలినాయుడు చెరువు | 592 | 184 | 120 | 288 |
| 9 | బుచ్చిరెడ్డిపాళెం | 534 | 222 | 179 | 133 |
| 10 | బుచ్చిరెడ్డిపాళెం | 611 | 176 | 253 | 179 |
| 11 | బుచ్చిరెడ్డిపాళెం | 799 | 468 | 207 | 124 |
| 12 | బుచ్చిరెడ్డిపాళెం | 765 | 317 | 229 | 219 |
| 13 | బుచ్చిరెడ్డిపాళెం | 850 | 547 | 97 | 206 |
| 14 | బుచ్చిరెడ్డిపాళెం | 804 | 521 | 142 | 141 |
| 15 | బుచ్చిరెడ్డిపాళెం | 535 | 312 | 85 | 138 |
| 16 | బుచ్చిరెడ్డిపాళెం | 450 | 185 | 196 | 69 |
| 17 | బుచ్చిరెడ్డిపాళెం | 511 | 246 | 200 | 65 |
| 18 | బుచ్చిరెడ్డిపాళెం | 410 | 226 | 128 | 56 |
| 19 | బుచ్చిరెడ్డిపాళెం | 490 | 195 | 221 | 74 |
| 20 | బుచ్చిరెడ్డిపాళెం | 429 | 217 | 154 | 58 |
| 21 | బుచ్చిరెడ్డిపాళెం | 391 | 170 | 162 | 59 |
| 22 | బుచ్చిరెడ్డిపాళెం | 424 | 223 | 132 | 69 |
| 23 | బుచ్చిరెడ్డిపాళెం | 447 | 247 | 150 | 50 |
| 24 | బుచ్చిరెడ్డిపాళెం | 346 | 149 | 117 | 80 |
| 25 | బుచ్చిరెడ్డిపాళెం | 432 | 212 | 134 | 86 |
| 26 | బుచ్చిరెడ్డిపాళెం | 614 | 278 | 237 | 99 |
| 27 | బుచ్చిరెడ్డిపాళెం | 599 | 204 | 260 | 135 |
| 28 | బుచ్చిరెడ్డిపాళెం | 455 | 193 | 200 | 62 |
| 29 | బుచ్చిరెడ్డిపాళెం | 537 | 261 | 232 | 44 |
| 30 | బుచ్చిరెడ్డిపాళెం | 431 | 194 | 115 | 122 |
| 31 | బుచ్చిరెడ్డిపాళెం | 450 | 216 | 178 | 56 |
| 32 | పల్లిపాళెం | 613 | 409 | 114 | 90 |
| 33 | పల్లిపాళెం | 605 | 335 | 154 | 116 |
| 34 | ఇస్కపాళెం | 487 | 330 | 105 | 52 |
| 35 | ఇస్కపాళెం | 521 | 303 | 123 | 95 |
| 36 | వడ్డిపాళెం | 1033 | 464 | 354 | 215 |
| 37 | వడ్డిపాళెం | 1040 | 333 | 523 | 184 |
| 38 | రేబాల | 611 | 189 | 324 | 98 |
| 39 | రేబాల | 520 | 190 | 191 | 139 |
| 40 | రేబాల | 575 | 174 | 303 | 98 |
| 41 | రేబాల అమ్మవారితోపు | 787 | 298 | 434 | 55 |
| 42 | రేబాల నెహ్రూనగర్ | 804 | 347 | 362 | 95 |
| 43 | రేబాల నాగాయగుంట | 660 | 351 | 150 | 159 |
| 44 | నాగమాంబపురం | 617 | 264 | 285 | 68 |
| 45 | నాగమాంబపురం | 635 | 274 | 272 | 89 |
| 46 | పంచేడు | 632 | 369 | 136 | 127 |
| 47 | పంచేడు | 492 | 276 | 69 | 147 |
| 48 | మినగల్లు | 582 | 292 | 144 | 146 |
| 49 | మినగల్లు | 553 | 289 | 94 | 170 |
| 50 | మినగల్లు | 906 | 506 | 317 | 83 |
| 51 | జెడిఎస్ఎంపిపి స్కూల్ | 668 | 251 | 208 | 209 |
| 52 | జొన్నవాడ | 607 | 265 | 166 | 176 |
| 53 | పెనుబల్లి | 611 | 444 | 119 | 48 |
| 54 | పెనుబల్లి | 476 | 401 | 48 | 27 |
| 55 | సాల్మాన్‌పురం | 483 | 358 | 98 | 27 |
| 56 | చెల్లాయపాళెం | 652 | 364 | 221 | 67 |
| 57 | చెల్లాయపాళెం | 781 | 605 | 120 | 56 |
| 58 | కాళయకాగొల్లు | 781 | 409 | 238 | 134 |
| 59 | కాళయకాగొల్లు | 716 | 428 | 200 | 88 |
| 60 | దామరమడుగు | 607 | 373 | 173 | 61 |
| 61 | దామరమడుగు | 577 | 400 | 110 | 67 |
| 62 | దామరమడుగు ఎస్సీకాలనీ | 460 | 323 | 107 | 30 |
| 63 | రామచంద్రారెడ్డినగర్ | 629 | 301 | 306 | 22 |
| 64 | దామరమడుగు | 415 | 266 | 108 | 41 |
| 65 | పల్లిపాళెం | 260 | 112 | 54 | 94 |

## 2012 కోవూరు నియోజకవర్గ ఉపఎన్నికల ఓట్ల వివరాలు

| బూత్ నెం | పోలింగ్ కేంద్రం | పోలైన ఓట్లు | వైఎస్ఆర్ కాంగ్రెస్ | టిడిపి | కాంగ్రెస్ |
|---|---|---|---|---|---|
| 66 | పాటూరు | 734 | 294 | 277 | 163 |
| 67 | పాటూరు | 655 | 250 | 192 | 213 |
| 68 | పాటూరు | 554 | 265 | 163 | 126 |
| 69 | పాటూరు | 570 | 353 | 112 | 105 |
| 70 | గంగవరం | 790 | 324 | 199 | 267 |
| 71 | గంగవరం | 464 | 197 | 130 | 137 |
| 72 | పోతిరెడ్డిపాళెం | 779 | 329 | 145 | 305 |
| 73 | పోతిరెడ్డిపాళెం | 672 | 417 | 99 | 156 |
| 74 | చంద్రశేఖరపురం | 708 | 342 | 126 | 240 |
| 75 | పోతిరెడ్డిపాళెం | 560 | 298 | 184 | 78 |
| 76 | కొత్త పడుగుపాడు | 535 | 318 | 89 | 128 |
| 77 | కొత్త పడుగుపాడు | 596 | 285 | 141 | 170 |
| 78 | కొత్త పడుగుపాడు | 672 | 336 | 172 | 164 |
| 79 | కొత్త పడుగుపాడు | 597 | 310 | 192 | 95 |
| 80 | పడుగుపాడు నేతాజీనగర్ | 564 | 205 | 115 | 244 |
| 81 | పడుగుపాడు నేతాజీనగర్ | 613 | 201 | 112 | 300 |
| 82 | పాత పడుగుపాడు | 1012 | 512 | 322 | 178 |
| 83 | పాత పడుగుపాడు | 669 | 342 | 175 | 152 |
| 84 | చంద్రమౌళినగర్ పడుగుపాడు | 730 | 322 | 62 | 346 |
| 85 | ఇనమడుగు | 825 | 221 | 248 | 356 |
| 86 | ఇనమడుగు | 623 | 172 | 188 | 263 |
| 87 | ఇనమడుగు | 582 | 219 | 185 | 178 |
| 88 | ఇనమడుగు | 592 | 137 | 248 | 207 |
| 89 | ఇనమడుగు | 683 | 215 | 245 | 223 |
| 90 | ఇనమడుగు | 370 | 156 | 121 | 93 |
| 91 | ఇనమడుగు జమ్మిపాళెం | 664 | 214 | 289 | 161 |
| 92 | లేగుంటపాడు | 674 | 218 | 113 | 343 |
| 93 | లేగుంటపాడు | 589 | 142 | 80 | 367 |
| 94 | లేగుంటపాడు | 415 | 289 | 55 | 71 |
| 95 | టిఇఎన్‌సి ప్రభుత్వ జూ॥ కాలేజీ | 866 | 413 | 285 | 168 |
| 96 | కోవూరు | 719 | 247 | 234 | 238 |
| 97 | కోవూరు | 817 | 413 | 151 | 253 |
| 98 | పెళ్లకూరు కాలనీ కోవూరు | 653 | 262 | 239 | 152 |
| 99 | పెళ్లకూరు కాలనీ కోవూరు | 677 | 256 | 203 | 218 |
| 100 | కోవూరు | 803 | 320 | 231 | 252 |
| 101 | కోవూరు | 673 | 217 | 217 | 239 |
| 102 | చుండుగుంట (కోవూరు) | 792 | 474 | 215 | 103 |
| 103 | కోవూరు | 698 | 315 | 158 | 225 |
| 104 | కోవూరు | 443 | 142 | 147 | 154 |
| 105 | కోవూరు | 459 | 131 | 187 | 141 |
| 106 | కోవూరు | 545 | 137 | 185 | 223 |
| 107 | కోవూరు | 606 | 211 | 199 | 196 |
| 108 | కోవూరు | 395 | 105 | 162 | 128 |
| 109 | కోవూరు | 784 | 276 | 148 | 360 |
| 110 | కోవూరు | 446 | 235 | 116 | 95 |
| 111 | కోవూరు | 383 | 225 | 82 | 76 |
| 112 | కోవూరు | 404 | 186 | 71 | 147 |
| 113 | కోవూరు | 661 | 333 | 149 | 179 |
| 114 | కోవూరు | 728 | 373 | 173 | 182 |
| 115 | కోవూరు | 591 | 343 | 113 | 135 |
| 116 | కోవూరు | 728 | 453 | 148 | 127 |
| 117 | గుమళ్లదిబ్బ (కోవూరు) | 881 | 287 | 274 | 320 |
| 118 | గుమళ్లదిబ్బ (కోవూరు) | 847 | 239 | 341 | 267 |
| 119 | చెర్లోపాళెం | 360 | 242 | 61 | 57 |
| 120 | కట్టకింద ఎస్సీ కాలనీ | 496 | 323 | 69 | 104 |
| 121 | సీతారామపురం | 777 | 252 | 145 | 380 |
| 122 | సీతారామపురం | 479 | 255 | 94 | 130 |
| 123 | వేగూరు | 765 | 259 | 236 | 270 |
| 124 | వేగూరు | 703 | 323 | 177 | 203 |
| 125 | మోడేగుంట | 718 | 371 | 231 | 116 |
| 126 | కొత్తవంగల్లు | 895 | 275 | 343 | 277 |
| 127 | పాత కొత్తవంగల్లు | 311 | 204 | 73 | 34 |
| 128 | బొట్లపాళెం | 286 | 179 | 78 | 29 |
| 129 | కొత్తవంగల్లు (గుంటకట్ట) | 386 | 156 | 135 | 95 |
| 130 | కొత్తవంగల్లు | 407 | 143 | 125 | 139 |

## 2012 కోవూరు నియోజకవర్గ ఉపఎన్నికల ఓట్ల వివరాలు

| బూత్ నెం | పోలింగ్ కేంద్రం | పోలైన ఓట్లు | వైఎస్ఆర్ కాంగ్రెస్ | టిడిపి | కాంగ్రెస్ |
|---|---|---|---|---|---|
| 131 | యల్లాయపాళెం | 641 | 321 | 225 | 95 |
| 132 | మిక్కిలింపేట | 406 | 218 | 99 | 89 |
| 133 | యల్లాయపాళెం | 472 | 171 | 123 | 178 |
| 134 | యల్లాయపాళెం | 370 | 120 | 90 | 160 |
| 135 | యల్లాయపాళెం | 504 | 221 | 91 | 192 |
| 136 | యల్లాయపాళెం (సంగాయపాళెం) | 377 | 165 | 167 | 45 |
| 137 | యల్లాయపాళెం (సంగాయపాళెం) | 736 | 260 | 179 | 297 |
| 138 | యల్లాయపాళెం | 477 | 123 | 153 | 201 |
| 139 | ఆలూరుపాడు | 515 | 316 | 102 | 97 |
| 140 | ఆలూరుపాడు (రెడ్డిపాళెం) | 416 | 204 | 37 | 175 |
| 141 | మానేగుంటపాడు | 403 | 195 | 152 | 56 |
| 142 | రామన్నపాళెం | 1004 | 521 | 205 | 278 |
| 143 | నార్తురాజుపాళెం | 845 | 342 | 225 | 278 |
| 144 | నార్తురాజుపాళెం | 751 | 299 | 195 | 257 |
| 145 | నార్తురాజుపాళెం | 760 | 341 | 153 | 266 |
| 146 | నార్తురాజుపాళెం | 987 | 515 | 258 | 214 |
| 147 | గండవరం | 856 | 540 | 197 | 119 |
| 148 | గండవరం | 696 | 374 | 229 | 93 |
| 149 | గండవరం | 415 | 198 | 134 | 83 |
| 150 | గండవరం (తాటాకులదిన్నె) | 813 | 315 | 143 | 355 |
| 151 | పెయ్యలపాళెం | 594 | 291 | 195 | 108 |
| 152 | బొడ్డువారిపాళెం | 409 | 175 | 153 | 81 |
| 153 | బొడ్డువారిపాళెం | 513 | 198 | 157 | 158 |
| 154 | కమ్మపాళెం | 614 | 141 | 408 | 65 |
| 155 | చంద్రశేఖరపురం | 764 | 390 | 322 | 52 |
| 156 | రాచర్లపాడు | 453 | 138 | 157 | 158 |
| 157 | రేగడిచెలిక | 802 | 315 | 204 | 283 |
| 158 | తలమంచి | 978 | 455 | 293 | 230 |
| 159 | తలమంచి | 618 | 343 | 136 | 139 |
| 160 | పద్మనాభసత్రం | 739 | 254 | 371 | 114 |
| 161 | నాయుడుపాళెం | 683 | 348 | 161 | 174 |
| 162 | గుండాలమ్మపాళెం | 830 | 340 | 302 | 188 |
| 163 | కొడవలూరు | 813 | 306 | 252 | 255 |
| 164 | కొడవలూరు | 473 | 166 | 175 | 132 |
| 165 | కొడవలూరు | 828 | 358 | 250 | 220 |
| 166 | బసవాయపాళెం | 281 | 131 | 87 | 63 |
| 167 | వెంకన్నపురం | 329 | 219 | 94 | 16 |
| 168 | దామేగుంట | 925 | 429 | 210 | 286 |
| 169 | జడ్పీహైస్కూల్ (నార్తురాజుపాళెం) | 820 | 355 | 205 | 260 |
| 170 | జడ్పీహైస్కూల్ (నార్తురాజుపాళెం) | 700 | 297 | 195 | 208 |
| 171 | జడ్పీహైస్కూల్ (నార్తురాజుపాళెం) | 485 | 255 | 111 | 119 |
| 172 | జడ్పీహైస్కూల్ (నార్తురాజుపాళెం) | 745 | 399 | 116 | 230 |
| 173 | తుమ్మగుంట | 388 | 124 | 70 | 194 |
| 174 | దంపూరు | 582 | 215 | 148 | 219 |
| 175 | దంపూరు | 527 | 282 | 59 | 186 |
| 176 | గోల్కొండాయతోపు | 251 | 119 | 70 | 62 |
| 177 | జడ్పీ హైస్కూల్ (వావిళ్ల) | 971 | 424 | 99 | 448 |
| 178 | వావిళ్ల | 523 | 269 | 116 | 138 |
| 179 | ఎంఆర్ఆర్ జడ్పీహైస్కూల్ | 648 | 300 | 184 | 164 |
| 180 | ఎంఆర్ఆర్ జడ్పీహైస్కూల్ | 623 | 206 | 281 | 136 |
| 181 | ఎంఆర్ఆర్ జడ్పీహైస్కూల్ | 646 | 390 | 145 | 111 |
| 182 | విడవలూరు ఎమ్పీపిస్కూల్ | 879 | 579 | 212 | 179 |
| 183 | విడవలూరు జడ్పీహైస్కూల్ | 520 | 188 | 208 | 124 |
| 184 | విడవలూరు జడ్పీహైస్కూల్ | 494 | 195 | 128 | 171 |
| 185 | ఎమ్పీపిస్కూల్ విడవలూరు | 367 | 145 | 79 | 143 |
| 186 | కెవిఎన్ జడ్పీహైస్కూల్ | 610 | 292 | 230 | 88 |
| 187 | కెవిఎన్ జడ్పీహైస్కూల్ | 665 | 322 | 227 | 116 |
| 188 | కెవిఎన్ జడ్పీహైస్కూల్ | 550 | 299 | 152 | 99 |
| 189 | ఎంపిపి స్కూల్ | 895 | 630 | 73 | 192 |
| 190 | అన్నారెడ్డిపాళెం | 759 | 359 | 241 | 159 |
| 191 | అన్నారెడ్డిపాళెం | 711 | 403 | 122 | 186 |
| 192 | అన్నారెడ్డిపాళెం | 685 | 422 | 139 | 124 |
| 193 | అన్నారెడ్డిపాళెం | 373 | 195 | 66 | 112 |
| 194 | గాదెలదిన్నె | 837 | 325 | 161 | 351 |
| 195 | గాదెలదిన్నె | 1019 | 615 | 173 | 231 |

కొరవ 14వ పేజీలో

# లవ్‌లీగా లేదు



✍ అల్లూరు రహీం

చిత్ర సమీక్ష

తెలుగు సినీ పరిశ్రమలో మహిళా దర్శకుల సంఖ్య చాలా తక్కువ. ఇప్పుడైతే బి.జయ, నందినీరెడ్డిలు మాత్రమే ఉన్నారు. ఐదు చిత్రాలకు దర్శకత్వం వహించిన అనుభవంతో ఆర్‌జె సినిమా పతాకంపై బి.జయ కథ, స్క్రీన్‌ప్లే, ఎడిటింగ్ బాధ్యతలు కూడా నెరపి తీసిన చిత్రం లవ్‌లీ. ఓ తండ్రి, కూతుళ్ల మధ్య అనుబంధాన్ని అందంగా ఆవిష్కరించే ప్రయత్నంలో సగం మాత్రమే దర్శకురాలు జయ కృతకృత్యులయ్యారనిపిస్తుంది. తండ్రీ కూతుళ్ల మధ్య అనుబంధాల్లో ఇదివరకటితో పోలిస్తే ఇప్పుడు చాలా మార్పులొచ్చాయి. ప్రతి తండ్రీ తన కూతురిని ఎంతో మురిపెంగా పెంచుతున్నాడు. ఈ విషయాన్నే చెబుతూ ఈ మధ్య ఆకాశమంత, నువ్వే నువ్వే చిత్రాలొచ్చినా అవి అంతగా ప్రేక్షకులను అలరించలేదు. కానీ సినీ జర్నలిస్ట్‌గా మంచి అనుభవమున్న జయ లవ్‌లీ చిత్రకథను అన్ని రసాలు గుదిగుచ్చి వ్రాసుకొన్నారు. స్క్రీన్‌ప్లే ప్రధమార్థంలో చకచకా నడిచేస్తుంది. మంచి పాటలు, డైలాగుల్లో కిక్కు కుదిరింది. పాటల్లో టర్కీ దేశ అందాలు కెమెరామెన్ అరుణ్‌కుమార్ చాలా అందంగా తెరకెక్కించాడు. కళా దర్శకుడు ప్రతి సన్నివేశ చిత్రీకరణ లొకేషన్‌ను కళాత్మకంగా తీర్చిదిద్దాడు. హీరో ఆది తన రెండవ చిత్రమైనా మంచి ఈచ్‌తో నటన, డ్యాన్సులు, ఫైట్స్ అదరగొట్టేశాడు. ఈ సినిమాకు పెద్ద మైనస్ పాయింట్ హీరోయిన్ శాన్వి. ఈ అమ్మాయి బాగానే నటించింది గానీ ముఖాన గ్లామర్ లేదు. ప్రేమకథా చిత్రంలో హీరోయిన్ ఇలా ఉంటే ప్రేక్షకులు మెచ్చరు. ద్వితీయార్థంలో దర్శకురాలు కథనడవను ఎంచుకొన్న సాగదీత మార్గం కూడా ప్రేక్షకుల సహనాన్ని పరీక్షించింది. పురుష దర్శకుల కన్నా మహిళా దర్శకులు తక్కువ తినలేదని బి.ఎఫ్, కొడకా వంటి డైలాగులు సినిమాలో విరివిగా వాడారు. ఆపేదెవరో చరణంతో సాగే పాటలో కేరళ సరస్సులో హీరోయిన్‌ను బోల్డ్‌గా చూపే ప్రయత్నం చేశారు. అనూప్ రూబెన్స్ సంగీతంలో తొలిపాట ప్రారంభ చరణం అర్థం కాకపోయినా చోరీ చోరీయే, లవ్‌లీ లవ్‌వీ, నిన్ను చూపిన క్షణమున చరణాలతో సాగే పాటలు, వాటిని చిత్రీకరించిన తీరు బాగుంది. స్క్రిప్ట్‌కు మెరుగులు దిద్దడంతోపాటు శ్యామ్‌మనోహర్ చిత్రంలో మంచి మాటలే వ్రాశాడు. అమ్మాయిని లవ్‌లో దింపాలంటే లక్ష అబద్ధాలు చెప్పాలి. ఫేస్‌వ్యాల్యూ లేని వారికి ఫేస్‌బుక్. ఈ సభలకు జనం ఎలా వస్తున్నారు?(జగన్) థేడ్ దిమాక్‌గాడు, హార్ట్‌ను ఫార్మేట్ చేస్తాతోపాటు పలు విరుపులున్నాయి. రామ్-లక్ష్మణ్ ఈ చిత్రంలో ఆది చేత కష్టమైన ఫైట్స్ కూడా అలవోకగా చేయించారు.

చిత్ర కథలోనికివెళ్తే మంగళంపల్లి మహారధి(రాజేంద్ర ప్రసాద్)కు ఆయన కుమార్తె లావణ్య (శాన్వి) అంటే ప్రాణం. ఆమెను చిన్నప్పటి నుంచి విపరీతమైన ప్రేమాభిమానాలతో పెంచుతాడు. లావణ్యకు కూడా తండ్రి అంటే ఎంతో అభిమానం. నెట్‌లో ఛాటింగ్‌తో ప్రేమికులయ్యే లిల్లీ (చిన్మయి), కిట్టూ(హర్షవర్ధన్)ల మిత్రులు ఆకాష్(ఆది), లావణ్యను తమ బదులు కాఫీబార్‌కు మీటింగ్‌కు పంపుతారు. అప్పటి నుంచి ఆకాష్, లావణ్యలు కాస్త కెమిస్ట్రీ జరిగి దగ్గరైపోతారు. ఈ విషయాన్ని లావణ్య తన తండ్రి మహారధికి చెబుతుంది. ఆకాష్ ట్రాక్ సరిగ్గాలేకపోవడంతో పూర్తి వివరాలు తెలుసుకోను వారి ఇంట్లో పనిమనిషి మంగళంగా చేరుతాడు. లిల్లీ తండ్రి మంత్రి(పరుచూరి గోపాలకృష్ణ). లిల్లీ, కిట్టూ పెళ్లి చేయను తెలివైన ఎత్తుగడ వేస్తాడు ఆకాష్. ఆకాష్‌ను తన కుమార్తెకు దూరం చేయను మంత్రాంగం నెరిపిన మహారధి విఫలమవుతాడు. ఒకానొక దశలో లావణ్య తన తండ్రిని కాదని అతనితో రానంటుంది. చివరికి మహారధి పెద్ద మనసు చేసుకొని ఆకాష్, లావణ్యలను ఒకటి చేయడంతో చిత్రం ముగుస్తుంది. హీరోయిన్ కాస్త మెరుగ్గా ఉంటే ఈ చిత్రం లవ్‌లీగానే ఉండేది.

## అమీజాక్సన్ అదృష్టం



సినీ పరిశ్రమలో విదేశీ అందాలు తరచూ కనువిందు చేస్తుంటాయి. ఎంతమంది వచ్చినా, రెండో సినిమాకే పెట్టే బేడా సర్దేస్తున్నారు. కానీ వరుసగా అవకాశాలు అందుకొంటోంది అందాల భామ అమీజాక్సన్. ఈమె 1947 ఎ లవ్‌స్టోరీ చిత్రంలో నటించి అందరినీ మెప్పించింది. గౌతమ్ మీనన్ హిందీలో తీసిన 'ఏం మాయచేశావె' చిత్రంలో నటించే అవకాశం అందుకొంది. అప్పటినుంచి ఈ అమ్మడు తెగ బిజీ అయిపోయింది. తమిళంలో హీరో విక్రమ్, తెలుగులో రామ్‌చరణ్ సరసన హీరోయిన్‌గా నటిస్తుంది. తన కొస్తున్న అవకాశాలపై మాట్లాడుతూ మోడల్‌గా పేరు తెచ్చుకోవాలనుకొన్నా. సినిమాల్లో అవకాశాలపై అవకాశాలు వస్తూ ఇక్కడే ఉండిపోదామనిపిస్తుంది. స్నేహితులు స్వదేశం రావా అంటున్నారు. కాని నా జీవితం సినిమాలతో ముడిపడిపోయిందంటుంది.

## మళయాళానికి ఛార్మి



తెలుగులో హీరోయిన్ ఛార్మికి అవకాశాలు రావడం లేదు. దాంతో మళయాళ పరిశ్రమపై దృష్టిపెట్టింది. మమ్ముట్టి సినిమాలో నేరస్థురాలి పాత్ర పోషిస్తుంది. ఈ సినిమా కోసం పారితోషికంలోనూ రిబేటు ఇచ్చిందట. ఈ విషయం ఛార్మినే చెబుతూ ప్రతి సినిమాను డబ్బులతో ముడిపెట్టడం నాకు నచ్చదు. మంచిపాత్రలొచ్చినప్పుడు పారితోషికం విషయంలో బెట్టు చేయకూడదు. పదేళ్ల తర్వాత కూడా నా పేరు చెప్పగానే ఈ సినిమా గుర్తొస్తుంది. అంత మంచిపాత్ర లభించింది. పైగా మమ్ముట్టితో సినిమా, భాషాబేధం లేకుండా అగ్ర కథానాయకులందరితోనూ నటించాను. అమితాబ్‌బచ్చన్ పక్కనా మెరిశాను. ఇప్పుడు మమ్ముటితో నటించడం సంతోషంగా వుందని చెప్పింది.

## పెళ్లికి రెడీ



పెళ్లి ఊసెత్తగానే చిర్రెత్తుకపోయే హీరో శింబునే ఈమాట అంటున్నాడు. వచ్చే ఏడాది పెళ్లి చేసుకొంటాను. ఓ మంచి అమ్మాయిని చూడమని మా అమ్మకు చెప్పాను. అమ్మాయి ఎలా వుండాలంది. చాలా అందంగా వుండాలి. అప్పుడైతేనే పుట్టే పిల్లలు కూడా అందంగా వుంటారు. నాకు పిల్లలంటే ఇష్టం. వాళ్లతో ఆడుకోవాలని ఆశ అని చెప్పానన్నాడు. ప్రేమించి పెళ్లి చేసుకుంటారా అంటే ఒక్క సంవత్సరంలో ప్రేమ అనేది అసాధ్యం. ఓ వ్యక్తిని అర్థం చేసుకొని, జీవిత భాగస్వామిగా ఆహ్వానించడానికి 12నెలలు సరిపోవు. అందుకే బుద్ధిగా పెద్దలు చూసిన అమ్మాయినే పెళ్లి చేసుకొంటానన్నాడు.

## నయనతార జోరు



ప్రభుదేవాతో విడిపోయాక నయనతార సినిమాలపై దృష్టి పెట్టింది. వరుసగా అవకాశాలు అందుకొంటుంది. గోపిచంద్ హీరోగా రూపొందే చిత్రంలో నటిస్తుంది. కృష్ణం వందే జగద్గురుమ్‌కు పచ్చజెండా ఊపింది. తమిళ కథలు వింటోంది. బాలీవుడ్‌లోనూ ఎంట్రీ కోసం దారులు వెతుకుతుంది. శ్రీరామరాజ్యం చిత్రంతో వచ్చిన పేరు నిలబెట్టుకుంటానే తప్ప చెడగొట్టుకోను అంటుంది.

## ఆ చిత్ర దర్శకుడెవరు?



అక్కినేని నాగేశ్వరావు, నాగార్జున, నాగచైతన్య కలసి నటించే సినిమాకు కథ సిద్ధమైందని ఫిల్మ్ నగర్ టాక్. ముందీ చిత్రానికి కృష్ణవంశీ దర్శకుడన్నారు. ఇప్పుడేమో ఇష్క్ ఫేం విక్రమ్ కె.కుమార్‌కు ఈ అవకాశం ఇచ్చినట్లు వార్తలొస్తున్నాయి. విక్రమ్ చెప్పిన కథ అక్కినేని కథానాయకులకు నచ్చిందట. అనుభవం, టేకింగ్‌లో ఎవర్ని పరిగణలోనికి తీసుకోవాలన్న ఆలోచనలో హీరో నాగార్జున వున్నట్లు తెలిసింది. మొత్తంమీద ఈ ఫ్యామిలీ హీరోల సినిమాకు దర్శకుడెవరో?



## ● ఊరికే రాజీనామా చేసేవారిపై

# చర్యలు తీసుకోవాలి!

స్వార్థ రాజకీయాలకు పాల్పడేవారు ఎన్నికల్లో పోటీచేయకుండా ఎన్నికల కమిషన్ సంస్కరణలు చేపట్టాలని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి డిమాండ్ చేశారు. తెలుగుదేశం పార్టీ ఆవిర్భావ దినోత్సవాన్ని పురస్కరించుకొని మార్చి 29వ తేదిన పలువురు నేతలతో కలసి నర్తకి సెంటర్‌లోని ఎన్టీఆర్ విగ్రహానికి పూలమాలలు వేసి నివాళులు అర్పించడంతోపాటు పార్టీ పతాకాన్ని ఆవిష్కరించారు. జిల్లా తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో ఈ వేడుకలను ఘనంగా నిర్వహించారు. ఈ సందర్భంగా సోమిరెడ్డి మాట్లాడుతూ తమ స్వార్థ ప్రయోజనాల కోసం ఎమ్మెల్యే, ఎమ్పీ పదవులకు రాజీనామా చేసే వారిపై కఠినచర్యలు చేపట్టాలన్నారు. అలాంటి వారు తిరిగి ఎన్నికలలో పోటీచేయకుండా నిషేధం విధించేలా ఎన్నికల కమిషన్ చట్టాల్లో మార్పు తీసుకురావాలన్నారు. అవినీతి అక్రమాలకు పాల్పడే వారి గురించి ప్రజలకు తెలియజెప్పాల్సిన బాధ్యత కార్యకర్తలపై ఉందన్నారు. వారిలో చైతన్యాన్ని తీసుకువచ్చి మంచి నేతను ఎన్నుకొనేలా చూడాలన్నారు. రాష్ట్రంలో తెలుగుదేశం పార్టీ ఆవిర్భావంతోనే రాజకీయాల్లో కొత్తతరానికి నాంది జరిగిందని, ఎన్నో సమూల మార్పులకు కారణం అయ్యిందన్నారు. తెలుగుదేశం పాలనలో రాష్ట్రంలో అవినీతికి తావు లేకుండా ఉండిందని గుర్తు చేశారు. పార్టీలో సుదీర్ఘ కాలంగా సేవలందిస్తున్న పుల్లయ్యగౌడ్, వెంకట సుబ్బరాజులను ఈ సందర్భంగా సన్మానించారు. మాజీ మంత్రి రమేష్‌రెడ్డి మాట్లాడుతూ బాలకృష్ణ పార్టీలో క్రియాశీలక పాత్ర పోషించడం శుభపరిణామం అన్నారు. ఈ కార్యక్రమంలో అంచెల వాణి, కిలారి వెంకటస్వామినాయుడు, నూనె మల్లిఖార్జున యాదవ్ తదితరులు పాల్గొన్నారు.


విలేకరుల సమావేశంలో మాట్లాడుతున్న సోమిరెడ్డి.

## పాఠశాలల్లో అదనపు గదులు!

రాజీవ్ విద్యామిషన్ ద్వారా జిల్లాలో వివిధ పాఠశాలల్లో చేపట్టిన అదనపు గదుల నిర్మాణాన్ని అధికారులు దృష్టి సారించారు. జిల్లా అదనపు జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం ఇటీవల రాజీవ్ విద్యామిషన్, విద్యాశాఖ, పంచాయితీరాజ్ అధికారులతో సమీక్ష సమావేశం నిర్వహించారు. వేసవి సెలవుల అనంతరం పాఠశాలలు పునః ప్రారంభమయ్యే నాటికి అదనపు గదుల నిర్మాణాలు పూర్తి చేయాలని రాజీవ్ విద్యామిషన్ అధికారులను ఆదేశించారు. అదనపు గదుల నిర్మాణ పనులను దక్కించుకున్న కాంట్రాక్టర్లతో సమావేశం ఏర్పాటుచేసి పనులు త్వరితగతిన చేయించాలన్నారు. పాఠశాలల్లో గదుల కొరత కారణంగా చెట్ల కిందనే చదువులు కొనసాగిస్తూ వస్తున్నారు. 2011–12 విద్యా సంవత్సరంలో పూర్తి చేయాల్సిన గదుల నిర్మాణాలు అధికారుల నిర్లక్ష్యం కారణంగా పూర్తికాకుండా పోయాయి. కాంట్రాక్టర్లు చేసిన పనులకు సకాలంలో బిల్లులు చెల్లించడం లేదన్న ఆరోపణలున్నాయి. గదుల కొరత ఉండడంతో వర్షాకాలం సమయంలో విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు పడుతుంటారు. అయితే పాఠశాల ఉపాధ్యాయులు ఏమీచేయలేని పరిస్థితిలో ఉన్నారు. పాఠశాలలు ప్రారంభమయ్యే నాటికి వీటిని ప్రారంభించాలి.

## ప్రైమ్ మల్టీస్పెషాలిటీ డెంటల్ హాస్పిటల్!


హాస్పిటల్‌ను ప్రారంభిస్తున్న డిఎంఅండ్‌హెచ్ఓ మాశిలామణి. ప్రక్కన హాస్పిటల్ అధినేతలు డాక్టర్ చంద్రమోహన్, డాక్టర్ స్వప్న.

నెల్లూరు పొగతోటలోని వెంకటరమణ హోటల్ వెనుక కొత్తగా కట్టిన ప్రైమ్ మల్టీస్పెషాలిటీ డెంటల్ హాస్పిటల్‌ను మార్చి 29వ తేది జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ కె.మాశిలామణి ప్రారంభించారు. హాస్పిటల్‌లో వివిధ విభాగాలను రత్నం విద్యాసంస్థల అధినేత కె.వి. రత్నం, ప్రముఖ సర్జన్ డాక్టర్ పి.మధుసూధనశాస్త్రి ప్రారంభించారు. ఈ హాస్పిటల్‌లో కార్పొరేట్ హాస్పిటళ్లకు ధీటుగా దంత వైద్యం చేస్తారు. హాస్పిటల్ అధినేత డాక్టర్ పాబోలు చంద్రమోహన్‌కు భీమవరం, ఖమ్మంలలోని డెంటల్ కాలేజిల్లో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పనిచేసిన అనుభవం ఉంది. డాక్టర్ పి.స్వప్న ప్రొస్టోడాంటిస్ట్. హాస్పిటల్ ప్రారంభోత్సవానికి డాక్టర్లు పి.ఎల్.రావు, భారతి, పి.వెంకటేశ్వర్లు తదితరులు విచ్చేసి డాక్టర్లకు శుభాకాంక్షలు అందజేశారు.

## వార్డెన్ల పనితీరుపై ఆన్‌లైన్ లేనట్టే...

హాస్టల్ వార్డెన్ల పనితీరును పర్యవేక్షించేందుకు రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఆన్‌లైన్ విధానానికి తీవ్ర అంతరాయం ఏర్పడింది. రాష్ట్ర వ్యాప్తంగా ఆన్‌లైన్‌లో సాంకేతిక సమస్య తలెత్తడంతో తాత్కాలికంగా వాటిని ప్రభుత్వం నిలిపి వేయడం జరిగింది. సంక్షేమ హాస్టళ్ల నిర్వహణ కోసం ప్రతి యేడాది కోట్ల రూపాయలు ఖర్చు చేయడం జరుగుతుంది. ఎన్ని నిబంధనలు విధించినా వార్డెన్లు ఏదో ఒక రూపంలో అవినీతి, అక్రమాలకు పాల్పడుతూనే ఉన్నారు. వీరికి సంక్షేమ శాఖల కార్యాలయాల్లోని సిబ్బంది, అధికారుల సహకారం ఉండడం వల్ల బయటపడగలుగుతున్నారు. ప్రభుత్వ నిబంధనల ప్రకారం పనిచేసే హాస్టల్‌కు సమీపంలోనే వార్డెన్ నివాసం ఉండాలి. అయితే కొందరు వార్డెన్లు ఉండడం లేదు. ఆన్‌లైన్ ద్వారా ఈ వ్యవహారాన్నంతా పరిశీలించాలని సాంఘిక సంక్షేమ శాఖ తలపోసి కొత్త సాంకేతిక విధానాన్ని అందుబాటులోకి తెచ్చినా సర్వర్ విఫలమవ్వడంతో ఆటంకాలు ఎదురౌతున్నాయి.

# అప్పు కోసం వచ్చేవారిని చిన్నచూపు చూడకండి!

ఆర్థిక ఇబ్బందుల కారణంగా సొమ్ము అవసరమై రుణం కోసం వస్తారు తప్ప ఊరికే వడ్డీ కట్టడానికి బ్యాంకుల వద్దకు రారని, ఈ విషయాన్ని బ్యాంకర్లు గ్రహించాలని జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి తెలిపారు. గోల్డెన్ జూబ్లీ సమావేశ మందిరంలో బ్యాంకర్లతో సమావేశం నిర్వహించిన కలెక్టర్ వారి పనితీరుపై తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. సమావేశం ప్రారంభంకాగానే రుణాలు అందజేయకుండా నిర్లక్ష్యం వహించడంపై కలెక్టర్ తీవ్రంగా స్పందించారు. పలు రకాల కారణాలతో బ్యాంకుల వద్దకు రుణాల కోసం వస్తుంటారు. దానిని దృష్టిలో ఉంచుకొని పని చేయాలన్నారు. ఆకలేసినపుడు అన్నం పెట్టడం అవసరం, ఆకలితీరిన తర్వాత పంచభక్ష పరమాన్నం పెట్టినా అది వృధా అవుతుందని చురకలంటించారు. ప్రభుత్వం సబ్సిడీని భరించి రుణాలివ్వమని చెప్తున్నా మీరెందుకు దానిని అమలు చేయలేకపోతున్నారంటూ బ్యాంకర్లను ప్రశ్నించారు. అప్పులివ్వడంలో బ్యాంకర్ల తీరు చూస్తుంటే నిరుత్సాహంగా ఉందని, తీరుమారకపోతే నోటీసులు జారీ చేస్తామని హెచ్చరించారు. లబ్ధిదారుల శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని రుణాలు మంజూరు చేయాలన్నారు. కౌలు రైతులపై ప్రత్యేక శ్రద్ధ పెట్టాలన్నారు. రికవరీలకు సంబంధించి గ్రామస్థాయిలో బృందాలను ఏర్పాటు చేసి వీటి గురించి ముందుగా సమాచారం ఇవ్వాలన్నారు. సబ్సిడీ భరిస్తూ ప్రభుత్వం నిధులు కేటాయిస్తున్నా రుణాలు ఇవ్వడంలో తాత్సారం చేస్తే నేరుగా జోక్యం చేసుకోవాల్సి ఉంటుందని హెచ్చరించారు.


బ్యాంకర్ల సమీక్షా సమావేశంలో మాట్లాడుతున్న కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి.

# సన్నరకం ధాన్యం కొనుగోలుకు ఆదేశాలు! ✦ అమలయ్యేనా?

జిల్లాలో రైతులు పండించిన సన్నరకం ధాన్యాన్ని కొనుగోలు చేయాలని ప్రభుత్వం ఆదేశించింది. ఇటీవల జరిగిన మంత్రివర్గ ఉప సంఘం సమావేశంలో ఈ మేరకు తీర్మానించారు. రైతుల నుంచి కొనుగోలుచేసిన సన్నరకం ధాన్యాన్ని మరఆడించి తక్కువ ధరకు రైతులకు విక్రయించాలని పౌరసరఫరాల శాఖకు ఉత్తర్వులు అందాయి. అలాగే ప్రస్తుతం రైతులు పండించిన ధాన్యం కొనుగోలు చేసేందుకు ఏర్పాటు చేసిన కేంద్రాల నుంచి కూడా సన్నరకం ధాన్యాన్ని కొనుగోలు చేయనున్నారు. రైస్ మిల్లర్ల సిబ్బంది దళారుల అవతారమెత్తి గ్రామీణ ప్రాంతాల్లో ధాన్యం కొనుగోలు చేస్తున్నారు. రైతులకు గిట్టుబాటు ధర ఇవ్వని వ్యాపారులపై క్రిమినల్ కేసులు నమోదు చేస్తామని అధికారులు ఇప్పటికే హెచ్చరికలు జారీ చేయడం, దానిపై రైస్‌మిల్లర్ల అసోసియేషన్ నేతలు స్పందించడం జరిగింది. రెవిన్యూ, పౌరసరఫరాల శాఖ అధికారులు పారదర్శకంగా వ్యవహరించక పోవడంతో రైతులు ఇబ్బంది పడుతున్నారు. తాజాగా ప్రభుత్వం అధికారులు మరింత అప్రమత్తంగా వ్యవహరించాలని పేర్కొంది. గోదాముల్లో పేరుకుపోయిన బియ్యం నిల్వలను తరలించడంతో పాటు రహస్య నిల్వలపై విజిలెన్స్ తనిఖీలు చేయాలని ఆదేశించింది.

11వ పేజీ కొరవ

## 2012 కోవూరు నియోజకవర్గ ఉపఎన్నికల ఓట్ల వివరాలు

| బూత్ నెం | పోలింగ్ కేంద్రం | పోలైన ఓట్లు | వైఎస్ఆర్ కాంగ్రెస్ | టిడిపి | కాంగ్రెస్ |
|---|---|---|---|---|---|
| 196 | గాదెలదిన్నె | 470 | 246 | 96 | 128 |
| 197 | సైక్లోన్ బిల్డింగ్ | 874 | 490 | 274 | 110 |
| 198 | ఎంపిపియుపి స్కూల్ | 749 | 222 | 221 | 306 |
| 199 | ఎంపిపియుపి స్కూల్ | 542 | 174 | 195 | 173 |
| 200 | ఎంపిపియుపి స్కూల్ | 544 | 145 | 186 | 213 |
| 201 | జడ్పీహైస్కూల్ | 829 | 303 | 283 | 243 |
| 202 | జడ్పీహైస్కూల్ | 986 | 495 | 298 | 193 |
| 203 | ఎంపియుపి స్కూల్ | 606 | 198 | 240 | 168 |
| 204 | జడ్పీపిస్కూల్ | 707 | 205 | 247 | 255 |
| 205 | జడ్పీహైస్కూల్ | 525 | 73 | 130 | 322 |
| 206 | ఎంపిపిఇ స్కూల్ | 602 | 295 | 101 | 206 |
| 207 | ఎంపియుపి స్కూల్ (పట్టపుపాళెం) | 957 | 212 | 368 | 377 |
| 208 | సైక్లోన్ బిల్డింగ్ | 772 | 284 | 190 | 298 |
| 209 | ఎంపిపియుపి స్కూల్ | 487 | 266 | 105 | 116 |
| 210 | పల్లిపాడు | 833 | 345 | 267 | 221 |
| 211 | పల్లిపాడు | 936 | 289 | 454 | 193 |
| 212 | లేబూరు | 797 | 344 | 228 | 225 |
| 213 | లేబూరు | 669 | 346 | 109 | 214 |
| 214 | నాగరాజుతోపు | 392 | 158 | 115 | 119 |
| 215 | పున్నూరు | 900 | 263 | 192 | 445 |
| 216 | నిడిముసలి | 908 | 362 | 271 | 275 |
| 217 | ముదివర్తిపాళెం | 630 | 258 | 259 | 113 |
| 218 | ముదివర్తిపాళెం | 590 | 223 | 210 | 157 |
| 219 | కుడితిపాళెం | 876 | 409 | 383 | 84 |
| 220 | కుడితిపాళెం | 787 | 372 | 372 | 43 |
| 221 | రాముడుపాళెం | 847 | 559 | 242 | 46 |
| 222 | కాలవమూలకండ్రిగ | 239 | 91 | 42 | 106 |
| 223 | గంగపట్నం | 696 | 316 | 223 | 157 |
| 224 | గంగపట్నం | 618 | 253 | 223 | 142 |
| 225 | గంగపట్నం | 406 | 228 | 142 | 36 |
| 226 | గంగపట్నం | 959 | 379 | 355 | 225 |
| 227 | పల్లిపాళెం | 617 | 307 | 225 | 85 |
| 228 | మైపాడు | 821 | 106 | 292 | 423 |
| 229 | మైపాడు | 824 | 141 | 381 | 302 |
| 230 | మైపాడు (పట్టపుపాళెం) | 820 | 106 | 451 | 263 |
| 231 | పట్టపుపాళెం (తూర్పు) | 666 | 67 | 293 | 306 |
| 232 | కృష్ణాపురం | 666 | 0 | 663 | 3 |
| 233 | కొరుటూరు | 948 | 337 | 420 | 191 |
| 234 | కొరుటూరు | 977 | 250 | 571 | 156 |
| 235 | సోమరాజుపల్లి | 975 | 425 | 260 | 290 |
| 236 | నరసాపురం | 760 | 189 | 395 | 176 |
| 237 | నరసాపురం | 586 | 171 | 240 | 175 |
| 238 | కొమరిక | 941 | 394 | 418 | 129 |
| 239 | కొమరిక | 590 | 259 | 250 | 81 |
| 240 | రావూరు | 1075 | 435 | 212 | 428 |
| 241 | ఇందుకూరుపేట | 612 | 177 | 284 | 151 |
| 242 | ఇందుకూరుపేట –1 | 616 | 185 | 255 | 176 |
| 243 | ఇందుకూరుపేట–1 | 670 | 226 | 250 | 194 |
| 244 | ఇందుకూరుపేట | 805 | 350 | 271 | 184 |
| 245 | ఇందుకూరుపేట–1 | 600 | 218 | 215 | 167 |
| 246 | ఇందుకూరుపేట –2 | 684 | 354 | 139 | 191 |
| 247 | ఇందుకూరుపేట –2 | 636 | 298 | 191 | 147 |
| 248 | ఇందుకూరుపేట –2 | 741 | 430 | 225 | 86 |
| 249 | ఇందుకూరుపేట –2 | 1015 | 374 | 349 | 292 |
| 250 | పాములవారిపాళెం | 1043 | 486 | 431 | 126 |
| 251 | లేబూరు–2 | 885 | 365 | 390 | 130 |
| 252 | లేబూరు–2 | 578 | 244 | 299 | 352 |
| 253 | లేబూరు –2 | 818 | 443 | 281 | 94 |
| 254 | పాగావారిపాళెం | 947 | 213 | 370 | 364 |
| 255 | పంచాగ్నుల కండ్రిగ | 475 | 221 | 132 | 122 |
| | పోస్టల్ బ్యాలెట్స్ | 2 | – | 2 | – |
| **మొత్తం** | | **1,65,655** | **73,876** | **50,382** | **41,397** |

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### కాంగ్రెస్ కుట్రలు – కుతంత్రాలు!

వైఎస్ జగన్మోహన్‌రెడ్డిపై అక్రమ కేసులు బనాయించి జైల్లో పెట్టాలని కాంగ్రెస్ ప్రభుత్వం కుట్రలు, కుతంత్రాలు సాగిస్తుందని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ దళిత విభాగం రాష్ట్ర కన్వీనర్ నల్లా సూర్యప్రకాష్ ఆరోపించారు. కోట మండలం అల్లంపాడు గ్రామంలో ఆ పార్టీ జిల్లా స్టీరింగ్ కమిటీ సభ్యుడు పేర్నేటి శ్యాంప్రసాద్‌రెడ్డి ఇంట్లో విలేకరులతో మాట్లాడారు. జగన్మోహన్‌రెడ్డిని జైల్లో పెడితే రాష్ట్ర ప్రజలు కాంగ్రెస్ పార్టీని ఉరికంబం ఎక్కించడం ఖాయమన్నారు. దివంగత వైఎస్‌రాజశేఖర్ రెడ్డి పాలనలో దళితులు అన్నివిధాలుగా అభివృద్ధి చెందారన్నారు. రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి, బత్తిన విజయకుమార్, పాదర్తి రాధాకృష్ణారెడ్డి, దువ్వూరు వెంకటరమణారెడ్డి, శ్రీహరి, ప్రభాకర్, బాబు తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### రాజధానికి నాన్‌స్టాప్ బస్

నెల్లూరు ఆర్టీసి బస్టాండ్ నుంచి హైదరాబాద్‌లోని జీడిమెట్ల వరకు నడిచే నాన్‌స్టాప్ ఆర్టీసి బస్సును 12వ తేది ప్రారంభించారు. ఇది నెల్లూరు ఆర్టీసి మెయిన్ బస్టాండ్‌లో రాత్రి 8.45 గంటలకు బయలుదేరి మరుసటిరోజు 5.45 గంటలకు హైదరాబాద్ చేరుకొంటుంది. జీడిమెట్లలో రాత్రి 9 గంటలకు బయలుదేరే ఆర్టీసి బస్సు ఉదయం 6 గంటలకు నెల్లూరు వస్తుందని, దీనిలో ఛార్జీ 387 రూపాయలుగా నిర్ణయించినట్లు వన్ డిపో మేనేజర్ మునిరాజా చెప్పారు. విసుగు లేకుండా హైదరాబాద్‌కు వెళ్లాలనుకొనే వారికి ఈ బస్సు ఎంతగానో ఉపయోగపడుతుందని చెప్పవచ్చు.

### రిమాండ్ ఖైదీ పరార్

హత్యకేసులో రిమాండ్‌లో ఉన్న ఖైదీ పరారైన ఘటన మార్చి 31వ తేది జరిగింది. వెంకటేశ్వరపురానికి చెందిన అల్లాభక్షు ఒక హత్యకేసులో నిందితుడు. గత రెండు నెలలుగా రిమాండ్ ఖైదీగా ఉన్నాడు. వాయిదా నిమిత్తం జిల్లా మేజిస్ట్రేట్ కోర్టుకు తీసుకొని వచ్చే సమయంలో పోలీసుల కళ్లుగప్పి తప్పించుకుపోయాడు. ఎంత గాలించినా కన్పడకపోవడంతో పోలీసులు వన్‌టౌన్‌లో ఫిర్యాదు చేశారు. ఈ విషయాన్ని గోప్యంగా ఉంచారు పోలీసు అధికారులు.

### మేలో వేసవి క్రీడా శిక్షణాశిబిరాలు

మే 1వ తేది నుంచి జిల్లాలో వేసవి క్రీడా శిక్షణాశిబిరాలను నిర్వహిస్తున్నట్లు ఇన్‌ఛార్జి డిఎస్‌డిఓ రాజేంద్రరెడ్డి తెలిపారు. మే నెలాఖరు వరకు జరిగే ఈ శిబిరాలను వివిధ ప్రాంతాల్లో నిర్వహిస్తున్నామన్నారు. దీనికోసం వ్యాయామ ఉపాధ్యాయులు, ఇతర ఉపాధ్యాయుల నుంచి దరఖాస్తులు కోరుతున్నట్లు తెలిపారు.

### విద్యుత్ ఛార్జీల పెంపుపై నిరసన

విద్యుత్ ఛార్జీలు పెంచడాన్ని నిరసిస్తూ సిపిఎం విద్యుత్ కార్యాలయాన్ని ముట్టడించింది. మార్చి 31వ తేది పొద్దునే పార్టీ కార్యకర్తలు అధిక సంఖ్యలో వెళ్లి ఛార్జీల పెంపును నిరసిస్తూ ధర్నాకు దిగారు. ఈ సందర్భంగా సిపిఎం నేత మాదాల వెంకటేశ్వర్లు మాట్లాడుతూ అసలే నిత్యావసర వస్తువుల ధరలు పెరిగి సామాన్యులు బ్రతకలేక పోతుంటే విద్యుత్ ఛార్జీలు పెంచడంతో వారి నడ్డి విరిగే పరిస్థితి నెలకొనిందన్నారు. ప్రభుత్వ చర్యలు సామాన్యుల జీవితాన్ని ఛిద్రం చేసేవిగా ఉన్నాయని విమర్శించారు. తక్షణం పెంచిన ఛార్జీలను తగ్గించాలని డిమాండ్ చేశారు. ప్రభుత్వ దిష్టిబొమ్మను దగ్ధం చేశారు.

### నవమి వేడుకలు

శ్రీరామనవమి పండుగను పురస్కరించుకొని నగరంలో వివిధ శ్రీరాముడి ఆలయాల్లో నవమి వేడుకలను ఘనంగా నిర్వహించారు. శబరి శ్రీరామ క్షేత్రంలో ప్రతి ఏడాది నిర్వహిస్తున్న విధంగానే ఈ ఏడాది సీతారాముల కళ్యాణాన్ని వైభవంగా నిర్వహించారు. టిటిడి కళ్యాణ మండపంలో జరిగిన ఈ కళ్యాణోత్సవానికి భక్తులు అధిక సంఖ్యలో తరలివచ్చారు. అలాగే చిల్డ్రన్స్ పార్కు వద్దగల సాయిబాబా మందిరంలో శ్రీరామనవమి సందర్భంగా బాబాకు గంధమహోత్సవం నిర్వహించారు. పుష్పపల్లకిపై సాయినాధుని నగరంలో ఊరేగింపు జరిపారు.

## కమ్యూనిస్టు యోధుడు జొన్నా కోటయ్య మరణం



నెల్లూరు జిల్లాలో పేరెన్నికగన్న కమ్యూనిస్టు యోధుడు జొన్నా కోటయ్య మరణించాడు. ఆయన వయస్సు 92 సంవత్సరాలు. చాలా చిన్న వయస్సులోనే కమ్యూనిస్టు భావజాలం పట్ల ఆకర్షితుడై, చివరి క్షణం వరకు దానికే తన జీవితాన్ని అంకితం చేసిన ఆదర్శప్రాయుడు కోటయ్య. సిపిఎం అగ్రనేత పుచ్చ లపల్లి సుందరయ్యనే సిద్ధాంతపరంగా ఎదిరించిన ధీశాలి. ఆ విభేదాలతో విప్లవ మార్గం పట్టి, తరిమెల నాగిరెడ్డితో పాటుగా జైలు జీవితాన్ని అనుభవించాడు. జైలు ఆయనకు రెండవ ఇల్లు. బ్రిటీష్ కాలంలోనే శ్రీకృష్ణ జన్మస్థానం వెళ్లి వచ్చాడు. జిల్లాలో జరిగిన ఎన్నో రైతు కూలీ పోరాటాలలో పాల్గొన్నాడు. జిల్లా బోర్డు సభ్యుడిగా, సర్పంచ్‌గా, సహకార సంఘం అధ్యక్షుడిగా పదవులు నిర్వహించాడు. సమాజంలో మనం చూస్తున్న దోపిడీ విధానాల నిర్మూలనకు విప్లవం ఒక్కటే మార్గమన్నది ఆయన విశ్వాసం. కడవరకు అదే నమ్మకాన్ని కొనసాగించడం ఆయన చిత్తశుద్ధికి తార్కాణం.

## పెనుబల్లి నారాయణరావు మరణం

కోవూరు తాలూకా పెనుబల్లి మాజీ మునసబు, స్నేహితాల రీత్యా రైతు సాహచర్యం వున్నా, స్వభావం రీత్యా కమ్యూనిస్టు భావాలు పుణికి పుచ్చుకొన్న పెద్ద మనిషి పార్లపల్లి వెంకట నారాయణరావు గత నెల 23తేదిన మరణించారు. ఆయన వయస్సు – 83 సంవత్సరాలు. భార్య, ఒక కుమారుడు, నలుగురు కుమార్తెలు వున్నారు.

పై రెండు కుటుంబాల వారికి మా సానుభూతి తెలియజేస్తున్నాము.

## జనవాణి

2వ పేజీ కొరవ

యళ్లు చూడవద్దన్నందుకు ఉరేసుకొని ఆత్మహత్య చేసుకొంది. ఇప్పటికైనా కేంద్ర ప్రసార మంత్రిత్వ శాఖ ఈ వ్యవహారమై తగిన చర్యలు తీసుకోమనవి.

ఎస్‌విఎస్.కోటేశ్వరరావు నెల్లూరు

## జగన్ అరెస్ట్

మొదటి పేజీ కొరవ

అయితే రోజులు గడుస్తున్నా జగన్ అరెస్టు విషయంలో సిబిఐ అధికారులు ఎటువంటి సంకేతాలూ ఇవ్వడం లేదు. ఒక వాదన ప్రకారం సిబిఐ ఆ జోలికి వెళ్లదని, మనీ ల్యాండరింగ్ నేరం ధృవపడిన తర్వాత ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ విభాగం రంగంలోకి దిగి, జగన్‌ను తమ అదుపులోకి తీసుకొంటుందని చెప్తున్నారు. అదే జరిగితే జగన్ తన జైలు జీవితాన్ని ఢిల్లీలో గడపవలసి వస్తుంది. చర్లపల్లి, చంచల్‌గూడ జైళ్లలో జగన్‌ను పెడితే రాష్ట్రంలో తీవ్రస్థాయిలో అల్లర్లు జరుగుతాయని, జైలు ముందు నిత్య అలజడి నడుస్తుందని, దాని వల్ల చాలా అనర్థాలు జరుగుతాయి కాబట్టి, సిబిఐ అందుకు సాహసించలేక పోతున్నదని చెప్తున్నారు. జగన్ అరెస్ట్‌కు దిగ్విజయసింగ్ వంటి వైఎస్ మిత్రులు విముఖంగా వున్నారు. కేంద్ర ప్రభుత్వానికి ఈ విషయంలో ఎప్పటికప్పుడు హెచ్చరికలు చేస్తున్నారు. కాశ్మీర్ మాజీ ముఖ్యమంత్రి, నేషనల్ కాన్ఫరెన్స్ నేత ఫరూక్ అబ్దుల్లా సైతం ప్రధానితో ఈ విషయం మాట్లాడినట్లు తెలుస్తున్నది. ఈ అన్ని కారణాల వల్ల ఇప్పట్లో జగన్ అరెస్ట్ వుండక పోవచ్చునని అంచనా.

## పదరంగం -9

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | | 4 | 5 | 6 | 7 |
| | | | | | | 8 | | 9 | | |
| 10 | | | | | | 11 | 12 | | | |
| | | | 13 | | 14 | | | | 15 | |
| | 16 | | | | | | 17 | 18 | | 19 |
| 20 | | | 21 | 22 | | | 23 | | | |
| 24 | | | 25 | | | 26 | | 27 | 28 | |
| | | 29 | | | 30 | | | | | |
| | 31 | | | 32 | | | | 33 | | 34 |
| | | | 35 | | | | 36 | | | |
| 37 | | | | | | | 38 | | | |

**అడ్డం**

1. శ్రీరాముని జన్మదినం (6)
4. గోదావరి ఒడ్డున ఉన్న శ్రీరామ క్షేత్రం (4)
9. త్రోవలో రవి గది ఉంది 2, 4,6 అక్షరాలు గ్రహించండి (3)
10. దుర్మార్గుడు, దుష్టుడు (3)
11. తాదాత్మత చెందడం (3)
13. ఇంగ్లీషు సముద్రం (1)
14. నిబంధన అటు నుంచే (3)
15. ఇంగ్లీషు ఊంపం (1)
17. ఆగమనం (2)
20. భక్త రామదాసు అసలు పేరు (6)
23. శిల్పం కాకముందు రూపు (2)
24. స్వప్నం (2)
25. పరిచారిక (2)
27. గోల్కొండ నవాబుకు స్వప్న దర్శనమిచ్చిన రామన్న (3)
29. అంతిమ శిక్ష (2)
30. త్రాగే ద్రవ పదార్థం (3)
31. భార్య (2)
32. ముస్లిం చక్రవర్తి (3)
33. బ్రహ్మ (3)
35. శుకము (3)
36. గతం (4)
37. పిరికితనం, భీతి (2)
38. చెమ్మ అటు నుంచే (2)

**నిలువు**

1. తాఖీదు (4)
2. పెనిమిటి, భర్త (3)
3. బాధపడి, దిగులు చెంది (3)
5. ద్రవ పదార్థం, క్షారము (3)
6. చరించేది (2)
7. నౌకలను నిలిపి ఉంచే సాధనం (3)
8. అందమైన స్త్రీ క్రింది నుంచి (3)
12. వృషభరాశికి ముందు రాశి (4)
16. స్థిరత్వం, నిలకడ లేనిది (3)
18. స్వప్నంతో ఒక వ్యాధి (3)
19. అడ్డం 27కి తమ్ముడు (3)
20. చేతికి ధరించేది (3)
21. గోదావరి నది 3 అక్షరాల్లో (3)
22. రెండైదులు (2)
26. రామదాసును ఖైదు చేసిన నవాబు (3)
29. వడ్రంగి/శిల్పి పనిముట్టు (2)
30. రాముని పాదరక్షలు (4)
31. రాబడి (3)
32. క్షీరం (2)
33. దఫా, స్టైల్ (3)
34. పినతల్లి 'స'కు వత్తులేదు (3)
35. షార్ట్‌కట్‌లో మెగాస్టార్ (2)
36. తలుపు గొళ్ళెం (2)

**సమాధానాలు**

## పదరంగం -8

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1భూ | న | భోం | 2త | రా | ళా | లు | | 3ఇ | లా | 4కా |
| మి | | | రం | | 5ర | వ | ళి | | | నీ |
| పూ | | | | 6అ | 7స | లు | | 8సం | శ | యం |
| 9జ | 10నా | ర | ణ్యం | | | 11వ | | దే | | డి |
| | గ | | | 12స్తో | 13మూ | | | 14హం | స | |
| 15ప | రా | గం | | | 16క | 17లు | 18వ | | | 19చ |
| | జు | | | 20న | | 21క | ల | 22శం | | ర |
| 23ప | | | 24జ | వ | రా | లు | | 25క | రు | ణ |
| టా | | కి | | వ | | 26క | ల | రు | | ము |
| 27కా | 28ప | రి | | సం | | లు | | డు | | లు |
| | 29స | 30ము | చి | తం | | | 31స్టే | | 32స్త్రా | |

# సంక్షిప్త సింహపురి

## శాస్త్రవేత్త జగదీష్‌కు అంతర్జాతీయ గౌరవం

నెల్లూరీయుడు, ప్రత్యామ్నాయ ఇంధన వనరుల శాస్త్రవేత్త డాక్టర్ జగదీష్‌కు వాషింగ్టన్‌లోని యుఎస్ ఫౌండేషన్ వర్కింగ్ గ్రూప్‌లైన సస్టైనబుల్ మరియు ఎంటర్‌ప్రైనర్ షిప్, ఎనర్జీ మరియు అగ్రికల్చర్‌లలో ప్రవేశం లభించింది. ఈ ఫౌండేషన్ గ్లోబల్ హెల్త్, ఎనర్జీ మరియు క్లైమేట్ చేంజ్, వుమెన్ అండ్ పాపులేషన్ మొదలైన అంశాలపై పని చేస్తుంది.

డాక్టర్ జగదీష్ ప్రత్యామ్నాయ ఇంధన వనరులు, అప్రాప్రియేట్ టెక్నాలజీలలో విశేషకృషి చేసినందుకు లెక్కలేనన్ని అంతర్జాతీయ అవార్డులు అందుకొన్నారు. ప్రస్తుతం ఈయన కవరైపేటలోని ఆర్ఎంకె ఇంజనీరింగ్ కాలేజీలో ప్రొఫెసర్‌గా పని చేస్తున్నారు.

## మూలపేటలో అన్నదానం

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ రెండవ శాసనసభ్యునిగా నల్లపరెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి అసెంబ్లీలో ప్రమాణ స్వీకారం చేసిన సందర్భాన్ని పురస్కరించుకొని మూలపేటలోని పొట్టి శ్రీరాములు విగ్రహం వద్ద అన్నదాన కార్యక్రమం నిర్వహించారు. దీనిలో మాజీ కార్పొరేటర్ రూప్‌కుమార్, మనోహర్, శ్రీనివాసయాదవ్, రాజేష్, వెంకటేశ్వర్లు, నజీర్‌బాష పాల్గొన్నారు.

## సాయిరాం ప్రసాద్ అభినందన సభ



మహానటుడు అక్కినేని నాగేశ్వరరావు చేతుల మీదుగా కళాభూషణ బిరుదునందుకొని సన్మానింపబడ్డ నెల్లూరీయుడు డివిఎస్.సాయిరాంప్రసాద్ అభినందనసభను టౌన్ హాల్‌లో కేతా అంకుల్ మెమోరియల్ ట్రస్ట్ ఇటీవల జరిపింది. సభకు అధ్యక్షత వహించిన యనమల నాగేశ్వరరావు యాదవ్ మాట్లాడుతూ అక్కినేని నాగేశ్వరరావు చేతుల మీదుగా డివిఎస్.సాయిరాం ప్రసాద్ అభినందనలు అందుకోవడం నెల్లూరుకే గర్వకారణమన్నారు. ఈ సందర్భంగా సాయివెన్నెల ఆర్కెస్ట్రా పాట కచ్చేరి అందర్నీ అలరించింది. ఆర్వీశేషయ్య నాయుడు, తులసి రామచంద్రరావు, రామమూర్తి, పెంచలయ్య, దుర్గం మధుసూధన్, సాయిరాం ప్రసాద్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## జననీ శిశు సురక్ష కార్యక్రమం

జననీ శిశు సురక్ష కార్యక్రమంలో భాగంగా జిల్లా వైద్య ఆరోగ్యశాఖ నేతృత్వంలో ఎపి జానపద కళాకారుల సంఘం కళాకారులు నెల్లూరు రూరల్ మండలంలోని నారాయణరెడ్డిపేటలో కళా ప్రదర్శన చేశారు. ప్రభుత్వం ద్వారా గర్భిణీ స్త్రీలకు కలిగే ప్రయోజనాలైన ఉచిత కాన్పు, సిజేరియన్ ఆపరేషన్, మందులు, ఆరోగ్య పరీక్షలు, ఆహారం, రవాణా సౌకర్యాలు, టీకాల గూర్చి వివరించారు. బిడ్డపుట్టిన తర్వాత 30 రోజుల వరకు తల్లీబిడ్డలకు ప్రభుత్వాసుపత్రులలో చేసే వైద్యం, వివాహ వయస్సు గూర్చి చైతన్యం కల్గించే పాటలు, నృత్యాలు, ఇంద్రజాల ప్రదర్శనను శ్రీనివాస్ కుమార్ కళాబృందం ప్రదర్శించి జనాన్ని చైతన్యపరిచారు.

## నేస్తం ఫౌండేషన్ రక్తదానం



నెల్లూరులోని నేస్తం ఫౌండేషన్ సంస్థ సభ్యులు 37 మంది రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్‌లో మార్చి 29తేది రక్తదానం చేశారు. ఈ సందర్భంగా నేస్తం ఫౌండేషన్ అధ్యక్షులు కోరెం ప్రవీణ్‌కుమార్ మాట్లాడుతూ సమాజ సేవలో భాగంగా రక్తదాన, నేత్ర దాన శిబిరాలు, మానసిక వికలాంగులకు ఆహార పంపిణీ కార్యక్రమాలు చేయాలన్న తలంపుతో కొంతమంది మిత్రులు కలిసి నేస్తం ఫౌండేషన్‌ను మాసం క్రితం ఏర్పాటు చేసినట్లు చెప్పారు. ఆ రోజు 213 మంది రక్తదానం చేశామన్నారు. ఈ శిబిరంలో నేస్తం ఫౌండేషన్ కోఆర్డినేటర్ కోరెం వెంకటేశ్వరరావు, వాలంటీర్లు మదన్, విక్రమ్, శ్రీను, శివ, నాగరాజు, మాధవన్, సతీష్, రాజేష్, పృథ్వీ, రాజేంద్ర, రాజా తదితరులు పాల్గొన్నారు.

## ఆర్యవైశ్య వృద్ధ దంపతుల కనకాభిషేకం

తిరుపతిలోని శ్రీవాసవీ ఆర్యవైశ్య సేవా సమాజం జూన్ 10తేదీ తిరుపతి తిరుచానూరు రోడ్డులోని పద్మావతి కళ్యాణ మండపంలో ఆర్యవైశ్య వృద్ధ దంపతులకు పంచమ సామూహిక కనకాభిషేక మహోత్సవాన్ని నిర్వహిస్తుంది. 108 వృద్ధ దంపతులకు సాంప్రదాయ షష్ఠిపూర్తి, భీమరథశాంతి, సహస్ర చంద్రదర్శన శాంతి కార్యక్రమాలు నిర్వహిస్తారు. పూర్తి వివరాలను జి.నరసింహారావు, 13-6-598/బి పి.కె.లేఅవుట్, తిరుపతి చిరునామాకు ఉత్తరం లేదా 94414 49488కి ఫోన్‌చేసి తెలుసుకోవచ్చు.

## రైతు లోకం



## వేరుశనగ పంటను ఆరబెట్టడం - నిల్వ చేయడం!

వేరుశనగ పంటను ఆరబెట్టడం, నిల్వ చేయడంలో కొన్ని జాగ్రత్తలు పాటించాలి. భూమి నుంచి పంట తీసేటప్పుడు కాయలలో 35 నుంచి 65శాతం తేమ వుంటుంది. ఇది 8-9 శాతానికి వచ్చేలా పెరికిన వెంటనే ఆరబెట్టాలి.

### ఎక్కువ ఎండలో ఆరబెట్టకూడదు!

రబీ సీజన్‌లో పంటను పెరికే సమయంలో వాతావరణంలో ఉష్ణోగ్రత 40 సెంటీగ్రేడు డిగ్రీల కంటే ఎక్కువ వుంటుంది. ఇలాంటి సమయాల్లో కాయలను నేరుగా ఎండలో ఆరబెట్టకూడదు. నీడలో లేదా ఎండ తక్కువ వుండే సమయం ఉదయం 11 గంటల లోపు, సాయంత్రం నాలుగు గంటల తర్వాత ఆరబెట్టుకోవచ్చు. ఆరబెట్టేటపుడు వేరే రకాల కాయలు కలవకుండా జాగ్రత్త వహించాలి. నూర్పిడి యంత్రాలను ఉపయోగిస్తే రకం మార్చినప్పుడల్లా శుభ్రపరిచేలా చర్యలు తీసుకోవాలి.

### నిల్వ చేయాలిలా!

విత్తనం కోసం బాగా ముదిరిన, శుభ్రం చేసిన కాయలను పాలిథిన్ లైనింగ్ వున్న గోనె సంచులలో నిల్వ చేయాలి. వేరుశనగ కాయలలో వేప ఆకులుగాని, వేప గింజల పొడిగాని కలిపి నిల్వ వుంచినప్పుడు పురుగుల ఉధృతి తక్కువగా వుంటుంది. కాయలను ఎక్కువ కాలం మొలకెత్తే శక్తి కోల్పోకుండా వుండాలంటే నిల్వ చేసే ఉష్ణోగ్రత తక్కువగా వుండాలి. గాలిలో తేమ 65 - 70 శాతం వుండాలి. దీని కంటే ఎక్కువగా ఉంటే శిలీంధ్రాలు అభివృద్ధి చెందుతాయి.

### పురుగు ఉధృతిని అరికట్టే పద్ధతి!

కాయలను నెలకొకసారి పరిశీలించి, పురుగు ఉధృతిని బట్టి క్రిమి సంహారక మందులలో ముఖ్యంగా మలాథియాన్ ఐదు మిల్లీ లీటర్లు లేదా డైక్లోర్‌వాస్ ఒక మిల్లీలీటరు లేదా క్లోరిపైరిఫాస్ 2.5 మిల్లీలీటర్ల చొప్పున సంచుల పైన, నిల్వ వుంచే గదులలోని గోడలపైన స్ప్రే చేయాలి. పురుగు ఉధృతి మరీ ఎక్కువైతే అల్యూమినియం ఫాస్పైడ్ మాత్రలను వాడితే సరిపోతుంది.

డాక్టర్ ఎం.రవీంద్రకుమార్ రెడ్డి,
ప్రధాన శాస్త్రవేత్త & కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.



# భారత సైన్యం నిజంగానే బలహీనమైపోయిందా?

"భారతదేశ రక్షణ వ్యవస్థ నూటికి 97 శాతం కాలం చెల్లిందిగా మారిపోయింది. సైన్యం దగ్గర తుపాకులున్నాయి కానీ, వాటిని పేల్చడానికి తూటాలు లేవు. శతఘ్నులకు మందుగుండు లేదు. ట్యాంకులకు మరమ్మత్తులు లేవు. ఇప్పటికిప్పుడు శత్రువు దాడి చేస్తే, చేతులెత్తేయడం తప్ప వేరే మార్గం లేదు. యుద్ధానికి అవసరమైన ఆయుధాలు, శతఘ్నులు, యంత్ర పరికరాలు, కాల్బలం, ప్రత్యేక దళాలు, సాంకేతిక సిబ్బంది, చివరకు వాయు సేన సైతం అత్యంత బలహీనస్థితిలో వుంది."



ఈ మాటలన్నది ఏ పాకిస్తాన్ నేతో అయి వుంటే పట్టించుకోనవసరం లేదు. చైనా సైన్యాధిప తులు ఆ అభిప్రాయం వ్యక్తం చేస్తే వారి బుద్ధి అంతేలే అని సరిపెట్టుకోవచ్చు. కానీ సాక్షాత్తూ భారత సైన్యాధిపతి జనరల్ వికె.సింగ్ వెలిబుచ్చిన అభిప్రాయం ఇది. ప్రధాన మంత్రికి వ్రాసిన రహస్య సందేశంలో ఈ అభిప్రాయాన్ని కుండబ్రద్దలు కొట్టి నట్లు చెప్పారాయన. ఈ రహస్య లేఖ బయటకు ఎట్లా పొక్కింది, ఒక సైన్యాధిపతిగా దేశ రహస్యాలను, రక్షణను ప్రమాదంలోకి నెట్టడం సమంజసమా కాదా అన్నది వేరే వివాదం. అసలు సమస్య, జనరల్ వికె.సింగ్ చెప్పినట్లు భారత సైన్యం నిజంగానే బల హీనమై పోయిందా, లేదా అన్నది మాత్రమే.

దేశ సరిహద్దులను, సార్వభౌమత్వాన్ని సైని కులు భద్రంగా కాపాడుతారన్న నమ్మకంతో 120 కోట్ల మంది భారతీయులు ప్రశాంతంగా జీవిస్తు న్నారు. ఒక్క చైనా చేదు అనుభవం తప్ప, తతిమా యుద్ధాలన్నింటిలోనూ మన సైనికులు ఆ విశ్వా సాన్ని పెంపొందింప చేశారు. మన శత్రువులు మన



కేసి తెరిపార చూడలేరన్న ధీమా సృష్టించారు. ఆ విశ్వాసం సడలితే ఇంతమందిలోను అశాంతి నెల కొంటుంది. కంటిమీద కునుకు పట్టదు. మనకు రక్షణ లేదు అన్న భావన ఎంత భయంకరమైనదో వర్ణించి చెప్పడం అసాధ్యం. ఏ దేశానికైనా వర్తించే ప్రమాదం అది. అయితే దేశ సైన్యాధిపతి స్వయంగా తన సేన శక్తి మీద అపనమ్మకం వ్యక్తం చేస్తున్నాడు. పైపై మెరుగులు తప్ప లోపలంతా డొల్ల అని తేల్చి పారేస్తున్నాడు. ఆయనే అంత మాట చెప్పిన తర్వాత నమ్మకుండా వుండడం ఎట్లా? కేంద్ర ప్రభుత్వం దీనిపై వివరణ ఇచ్చే స్థితిలో లేదు. ఏమి మాట్లాడితే ఏమి తంటానో అనే సందిగ్ధంలో మౌనాన్ని ఆశ్ర యిస్తున్నాడు రక్షణ మంత్రి ఎకె.ఆంటోని. సైన్యాన్ని పటిష్టం చేసే ప్రక్రియలో మేమంతా మీ వెంటే వుం టామని హామీ ఇస్తూనే, మరొకప్రక్క మన రక్షణ మంత్రి చేవలేని వాడని నిందిస్తున్నాయి ప్రతిపక్షాలు. చేవలేని రక్షణ మంత్రి ఒక ప్రక్క, చేతకాని రక్షణ శాఖ ఇంకొక ప్రక్క, తన మీదనే తనకు నమ్మకం లేని సైన్యాధిపతి మూడో పక్క చేరి కోట్లాది మంది భారతీయుల మనసులను కల్లోల పరుస్తున్నారు. చాలా చాలా దురదృష్టకరమైన పరిస్థితి ఇది. మరే దేశంలో కూడా ఇటువంటి పరిణామాలు సహిం చరు, కొనసాగించరు.

## బలవంతుడైన శత్రువు

ఇటీవలి వరకు మనకు ప్రధాన శత్రువు పాకి స్తాన్. ఇద్దరి మధ్య దాయాది పోరుకు సుదీర్ఘ చరిత్ర వుంది. కానీ అటు పాకిస్తాన్‌లోని అంతర్గత పరిస్థి తులు, ఇటు భారతదేశం సాధించిన సాంకేతిక ప్రగతి వల్ల పరిస్థితి మారింది. పాకిస్తాన్ మనకు ఏ రకంగానూ సరిజోడీ కాదు. ఒక్క అణుబాంబు విష యంలోనే వారిని చూసి మనం భయపడాలి. ఆ భయం మనకే కాదు, ప్రపంచం మొత్తానికి వుంది. ఇప్పుడు మనకు నిజమైన ప్రమాదం చైనా నుంచి మాత్రమే. వారి బలం అపారం. ఏ కారణం వల్ల నైనా యుద్ధం అనేది వస్తే, చైనాను ఓడించడానికి మన సర్వశక్తులూ ఒడ్డాలి. పాకిస్తాన్‌తో శత్రుత్వా నికి దాయాది మనస్తత్వం, అసూయ, మత విద్వే షం వంటివి కారణాలు. కానీ చైనా మనతో శత్రు త్వం నడపడానికి అంతకంటే బలీయమైన ఆర్థిక కారణాలు, ప్రపంచం మీద ఆధిపత్యం సాధించా లనే రాజ్యకాంక్ష దాగి వున్నాయి. అందువల్ల ఎప్పటి కైనా మనకు ప్రమాదం వారి నుంచే తప్ప పాకిస్తాన్ నుంచి కాదు.

## ముంచుకొస్తున్న ప్రమాదం

చైనాతో మనకు ముప్పేట ముప్పు వుంది. టిబెట్ సరిహద్దులలో చైనా పెద్ద ఎత్తున సైన్యాన్ని మొహరించి వుంది. ఆ మంచుకొండల పొడవునా ఆధునిక రోడ్లు, రైలు సౌకర్యాలు అభివృద్ధి పర చింది. ఈ చివరన వున్న పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీర్ నుంచి ఆ చివర వున్న అరుణాచల్ ప్రదేశ్ వరకు రైలు పట్టాలున్నాయి వారికి. ఒక చోట నుంచి మరొక చోటకు సైన్యాన్ని తరలించడం చిటికెలో పని. మరొకప్రక్క కీలకమైన ప్రదేశాలలో సిఎస్– ఎస్–2 తరహా మధ్యశ్రేణి బాలిస్టిక్ మిస్సైల్స్‌ను మొహరించింది. వాటి గురి భారతదేశం పైనే ఎక్కు పెట్టి వుండడం గమనార్హం. మరొకప్రక్క పాకి స్తాన్‌తో చైనా సైనిక సంబంధాలు రోజురోజుకూ బలపడుతున్నాయి. పాక్ ఆక్రమిత కాశ్మీర్ భూభా గంలో చైనా సైనిక స్థావరం ఒకటి ఏర్పాటై వుంది.



పాకిస్తాన్‌కు ఆయుధాలు, విమానాలతో పాటు అణుబాంబు తయారీ పరిజ్ఞానం, పరికరాలు కూడా సరఫరా చేస్తున్నది చైనా. ఏ కారణం వల్లనైనా భారత దేశాన్ని బెదరించాలనుకొంటే తాను వెనుక వుండి, పాకిస్తాన్‌ను ముందు నిలిపి ఒక ఆట ఆడించే కుయుక్తులకు సకల సన్నాహాలూ చేస్తు న్నారు వారు. మూడో ప్రక్క నేపాల్‌లోని మావో యిస్టులను చైనా బహిరంగంగానే బలపరుస్తున్నది. ఆ దేశంలో కూడా సైనికపరంగా తిష్ట వేస్తున్నది. నేపాల్ ప్రజలలో భారతదేశం పట్ల విద్వేష భావాలు పెంచడానికి దుష్ప్రచారం చేస్తున్నది. వీటన్నిటినీ మించి శ్రీలంకలో సైతం పాదం మోపుతున్నది. మొత్తం మీద దాదాపు 7500 కిలోమీటర్ల మేర భారతదేశ సరిహద్దులలో చైనా తన ప్రాబల్యాన్ని పెంచుకొంటున్నదని సైనిక నిపుణుల అంచనా.

## ఎందులోనూ పోలిక లేదు

భారత, చైనా సైనిక సామర్థ్యాలను పోల్చి చూస్తే ఎందులోనూ పోలిక, సమవుజ్జీతనం కన్పిం చదు. మనకంటే ఎన్నో రెట్లు అధిక శక్తి సంపన్నులు వారు. ఈ క్రింది పట్టిక చూడండి తేడా అర్థమౌ తుంది.

| | భారతదేశం | చైనా |
|---|---|---|
| సైనిక సిబ్బంది | 13,25,000 | 22,55,000 |
| యుద్ధ విమానాలు | 3382 | 9218 |
| వైమానిక స్థావరాలు | 334 | 489 |
| యుద్ధ నౌకలు | 145 | 284 |
| విమాన వాహకనౌక | 1 | లేదు |
| అణుబాంబులు | 50–70 | 200–400 |
| అణుబాంబు శక్తి | 0.05 మెగాటన్నులు | 4.00 మెగాటన్నులు |
| క్షిపణి శక్తి | అగ్ని–2 (2వేల కి.మీ) | డిఎఫ్–5ఎ (12వేల కి.మీ) డిఎఫ్–4 (7500 కి.మీ) |

ఏ కోణం నుంచి చూసినా సైనిక శక్తిలో భారతదేశం చైనాకు సమవుజ్జీ కాలేదు, కాబోదు కూడా. అందుకు కారణం సైన్యం కోసం వారు పెట్టే ఖర్చు మనకంటే మూడింతలు అధికం కావడం. గత సంవత్సరం భారతదేశం రక్షణ బడ్జెట్ మొత్తం లక్షా డెబ్బై వేల కోట్ల రూపాయలు మాత్రమే. ఇదే సమయంలో చైనా తన సైన్యం కోసం ఐదు లక్షల కోట్ల రూపాయలకు మించి ఖర్చు చేసింది.

## అసలు స్పర్థ ఎందుకు?

అసలు భారతదేశానికి, చైనాకు మధ్య స్పర్థ ఎందుకన్నది ప్రశ్న. నిజానికి ఈ రెండు దేశాల మధ్య కొన్ని శతాబ్దాల పాటు సంబంధ బాంధవ్యాలు న్నాయి. చారిత్రకంగా, సాంస్కృతికంగా, తత్వ సిద్ధాం



తాల పరంగా, ప్రజల జీవన శైలి పరంగా ఎంతో సాన్నిహిత్యం వుంది. కానీ రెండు దేశాలూ దాదాపు ఒకేసారి స్వాతంత్ర్యం సాధించాయి. భారతదేశం పూర్తిగా అహింస పద్ధతిలో బ్రిటీష్ దొరలను తరిమి వేస్తే, చైనా పూర్తి సైనిక శక్తితో రాచరిక పాలన నుంచి విముక్తి పొందింది. మావోయిస్టు ఆలోచనా ధోరణితో చైనా ఇప్పటికీ అంతర్గతంగా కానీ, అంత ర్జాతీయ విధానాల పరంగా కానీ సైనిక శక్తినే ప్రధానంగా ముందు నిలుపుతున్నది. వారి జాతి నేతలందరూ సైనికాధికారులే. మన నాయకులం దరూ ప్రజా ప్రతినిధులు మాత్రమే. దేన్నైనా చర్చ లతో సాధించవచ్చుననే నమ్మకంతో జవహర్‌లాల్

కొరవ 8వ పేజీలో

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com